# యక్షగానములు

## ( తంజావూరు )

సంపుటము ౧౦




1973



ఆంధ్ర విశ్వకళాపరిషత్తుచే ప్రకటితము

# యక్షగానములు

## (తంజావూరు)

సంపుటము ౧౦

పరిష్కర్త

ఆచార్య కాకర్ల వెంకటరామ నరసింహం, ఎం.ఎ., పిహెచ్.డి.

ఆంధ్ర శాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు




1974

ఆంధ్ర విశ్వకళాపరిషత్తుచే ప్రకటితము

# కృతజ్ఞతలు

ఈ కృతులను పరిష్కరించుటలో నాకు తోడ్పడిన డా. ఎం. వి. సత్యనారాయణ గారికి—

ఈ సాహితీ ముద్రణ ప్రణాళిక యథాపూర్వముగను పటిష్ఠముగను నిర్వహింపఁబడుటకై సర్వదా తోడ్పడు చున్న సహృదయశేఖరులు విశ్వకళాపరిషదుపకులపతులు శ్రీ లంకపల్లి బుల్లయ్య గారికిని—

వీనిని చక్కఁగా ముద్రించిన విశ్వకళాపరిషన్ముద్రణాలయాధ్యక్షులు శ్రీ సి. బొర్రేశ్వరరావు గారికిని—

యక్షగాన సంపుటములు (౭, ౮, ౯, ౧౦) ముద్రించుటలో ప్రత్యేక శ్రద్ధాసక్తులను, ముద్రణ కళానైపుణ్యమును ప్రదర్శించిన విశ్వకళాపరిషన్ముద్రణాలయమునందలి సిబ్బందికిని—

నా కృతజ్ఞతలు.

ఇందు ఎడనెడ ముద్రణ స్ఖాలిత్యములు రాక తప్ప లేదు. సహృదయులు దయతో మన్నింతురు గాక.

కె. వి. ఆర్. నరసింహం

# విషయసూచిక

# సతీపతిదాన విలాసము

రచయిత : శాహాజి

# సతీపతిదాన విలాసము

జయదేవకీపుత్ర జయదివ్య నుతిపాత్ర
జయకృష్ణ సుచరిత్ర జయ జగన్మిత్ర
జయశుభావహగాత్ర జయజగద్ధితసూత్ర
జయభాను శశినేత్ర జయ జితామిత్ర ౧

వేణునాదవిలోల విబుధ సన్నుతలీల
చాణూర మదజాల శాసనాభీల
బాణభంజనశీల పావనగుణావాల
వీణాముని విశాల వినయానుకూల ౨

విమత భీకరశౌర్య వేదాంతనుతచర్య
యమివినుత గుణధుర్య యదువంశవర్య
కమనీయ గాంభీర్య కాంచనాచలధైర్య
విమల మానసధార్య వినుత సౌందర్య. 3

శరణు శరణు

శరణు శరణు జగద్విధాయక
శరణు శ్రీహరి సాయక
శరణు శరణు శుభప్రదాయక
శరణు గిరిజా నాయక ౧

వారణాసుర మదవిదారణ
దారుణాఘ నివారణ
చారణస్తుత భువనకారణ
సాధు శుభద విచారణ ౨

నిజపదాశ్రిత పూతవానర
అఖిల దివిజాగ్రేసర
రజని రమణ కళావిభాసుర
విజితమత్త మహాసుర 3

సర్వసంభృత చరణ కింకర
గర్వితారి భయంకర
పార్వతీ హృదయేశ శంకర
భవహర క్షేమంకర. ౪

మంగళం

మహిషాసుర మర్దనితే మంగళం, నిత్యం
మహిత శ్రీవర్ధనితే మంగళం
అకళంక ఖేలనాయై యతిలోక పాలనాయై
మకరాంక లాలనాయై మంగళం ౧

ప్రణుత సంతోషితాయై భవ్య సంభాషితాయై
మణిగణభూషితాయై మంగళం ౨

అహివైరి సేవితాయై హరిభావభావితాయై
మహిత సంభావితాయై మంగళం 3

శహజేంద్ర పూజితాయై సజ్జనాధిష్ఠితాయై
మహిమా విరాజితాయై మంగళం ४

సూ. వ.: అవురా, యీ విధంబున నీ రీతి నాట్యారంభంబు సేసి సతీపతిదాన విలాస నాటకము నిర్విఘ్న సిద్ధ్యర్థముగా నభీష్ట దేవతావందనంబు గావించే మార్గంబు పరాకు.

శ్లో. లంబోదరస్సర్వ విద్యాలంబోదర హసన్ముఖః
బంధురస్సూత్య సుగుణైర్బంధురస్తు భవన్ముదే.

సూ. వ.: అవురా, యీ విధంబున నీ రీతి విఘ్నేశ్వరుని పాదపద్మములకు వందన మాచరించి మఱియు నే విధాన నంటేను.

శ్లో. చండస్తాండవకాండ శౌండ మహిమాశుండాల తుండోన్న మ
చ్చుండాదండ పిచండభాండ విహరత్క్రుండల్య ఖండశ్రియై
తండూద్దండితచండ డిండిమ ముఖోడిండీరపండైర్వహ
త్కాండైర్మండిత గండమండల జటాఖండోఽస్తు చండీపతేః.

సూ. వ.: అవురా, యీ విధంబున నీ తీరున నిష్టదేవతా ప్రార్థనంబు గావించి సభానాయకాదుల నభివర్ణించి సతీపతిదాన విలాసంబనియెడి నాటకంబు కథా క్రమముగా వినిపించెదము. విననవధరింపరయ్యా.

ద్విపద శ్రీ సత్యభామ నెచ్చెలితోన రాఁగ
నా సురమునియందు నరుదెంచి సకల
దాన మహత్వమత్తఱిఁ దెల్ప సత్య
పూని కృష్ణుని ధారవోయఁగ నపుడు
తాళాంకుఁడును యశోదాదేవి జమిలి
నల్గురు పడతులు నారదుతోన
హరిని యిమ్మనివేడ నతఁడు కృష్ణునికి

సరియైన ధనము లొసంగిన నిత్తు
ననిన వారలు విని యఖిల ధనంబు
గొనివచ్చి యిచ్చుట కుందకంబగుట
జలజాక్షి రుక్మిణి చనుదెంచి చేతి
తులసి దళంబుంచఁ దులఁదూగుటయును
దేవమునీంద్రుండు దేవిరుక్మిణికి
దేవదేవుని నిచ్చి దీవించుటయును
ననియెడి కథలచే నమరి వేడుకను
దనరు సతీపతి దాన నాటకము
సరస శుభోక్తుల సంతసంబునను
విరివిగా శాహభూవిభుఁడు గావించె
వరకవీశ్వరులెల్ల వర్ణనసేయ
ధరణిలో నాచంద్రతారార్కముగను.

సూ. వ.: అవురా, యీ విధంబున నీ రీతి కథాసంవిధానంబుగా వినిపించిన యా తదనంతరంబున సతీపతిదాన విలాసం బనియెడి నాటకంబునందుఁ దొలుత వినాయక ప్రార్థన సేయఁగా నా వినాయకుఁడు వచ్చేమార్గంబే విధానసంటేను.

ద్విపద పాశాంకుశంబులు పరఁగ హస్తముల
భాసుర కనక ప్రభల్విలసిల్లఁ
బొసఁగ లంబోదరంబున నాగవితతి
యనమాన కాంతితో నాడుచుండంగ
వలనొప్ప మూషిక వాహనంబెక్కి
వెలయ విఘ్నేశుండు వేడ్కతో వెడలె.

సూ. వ.: అవురా, యీ విధంబున నా విఘ్నేశ్వరుఁడు వచ్చే మార్గము పరాకు.

దరువు ముదమునఁ గుండలముల రుచులమరఁగ
నిదె వెడలెను విఘ్నేశ్వరుఁ డిపుడు ౧

కర్ణతాళములు గదలఁగ నల్లన
స్వర్ణ నిభుఁడు గణపతితగవచ్చెన్ ౨

మూషిక వాహనమున నొప్పుచు శుభ
వేమడు వెడలెను విఘ్నేశ్వరుఁడు 3

తన లంబోదరమున ఫణులాడఁగ
ఘనతను వెడలెను గజముఖుఁ డిపుడు ౪

మోదముతో గణముఖ్యులు గొలువఁగ
మోదకహస్తుఁడు ముదమున వెడలెన్. ౫

సూ. వ.: అవురా, యీ విధంబున నా విఘ్నేశ్వరుఁడు వచ్చిన యీ తదనంత రంబునఁ గథా సంవిధానంబే విధాననంటేను. ఆ సత్యభామ శృంగార వనంబునకు వచ్చు సమయంబునఁ దొలుతఁ గటికవాఁడు హెచ్చరిక దెలుపవచ్చే మార్గంబు పరాకు.

దరువు
పట్టె నామమును బెట్టి బరికోలఁ గేలఁబట్టి
దట్టిపైని దుప్పటి గట్టిగఁ గట్టి
జుట్టునిండ పూలుసుట్టి మిట్టిపండ్లు నెగఁబెట్టి
అట్టహాసముతో వికటాంగుడు వచ్చె.

సూ. వ.: అవురా, యీ విధంబున నా కటికవాఁడు వచ్చి హెచ్చరిక దెలిపిన యీ తదనంతరంబున నా సత్యభామ శృంగార వనంబునకు వచ్చే మార్గంబె విధాన నంటేను.

ద్విపద
బంగారు చెంగావి పావడఁగట్టి
శృంగారములను రాజిలు చీర మెఱయఁ
బద్మబాంధవు రీతిఁ బలుదిశల్మెఱయఁ
బద్మరాగపుఁ దీగెఁ బరఁగ ధరించి
మంజుళ నవరత్న మయమైనయట్టి
పంజాల కమ్మలింపార వీనులను
వన్నెమీఱిన డన వాలుగన్నులను
దిన్నఁగాఁ గాటుక దీర్చి నెన్నుదుటఁ
దెలివొందఁ గస్తూరి తిలకంబు దిద్ది
వెలయఁ గీల్జడనిండ విరిసరుల్దాల్చి
కంకణ యుగములు గరిమితోఁ బూని
పంకజములఁ బూని భామలు గొల్వ
భావజునికిఁ దపః ఫలమగు మంత్రి
దేవత యన [సత్య] దేవి దా వెడలె.

సూ. వ.: అవురా, యీ విధంబున నా సత్యభామ శృంగార వనంబునకు వచ్చేమార్గంబు పరాకు.

దరువు
ఒయ్యారమున వెడలెను అందముమీఱ
నొయ్యారమున వెడలెఁ డియ్యావిల్తు శరమునఁ
దొయ్యలు లందఱుఁగొల్వ నెయ్యమున సత్యభామ ౧

నన్నిపయ్యెదలోనఁ జిన్నిచన్నులు సెలఁగ
పున్నమచందురు సరిఁబోలు మోమువెలుఁగఁగ ౨

రాజిల్లురూపున విలరాజు మోహముఁజెందఁగ
రాజహంస నడలను రాజిలఁబోసనవేగ. 3

దరువు ముత్యాలకమ్మచాయ చెక్కిళ్ళ వింతవెన్నెలఁగాయ
జిత్తరుబొమ్మచాయ వచ్చెను శ్రీసత్యభామవచ్చె ౧

మంజీరరవముమించ హంసలు మగువను వెంబడింప
మంజుకలస్వరము చెలులనురంజిల్లఁజేయఁగరము ౨

బంగారుపైటచెరఁగు చెలఁగఁగ బొంగారుజిగిమెఱుఁగు
శృంగారములహెచ్చవేడ్కను శ్రీసత్యభామవచ్చె. 3

సూ. వ.: అవురా, యీవిధంబున నా సత్యభామ శృంగార వనంబునకు వచ్చిన యాతదనంతరంబున, నా నారద మహామునిశ్వరుఁడా సత్యభామ వద్దకు వచ్చెమార్గంబు పరాకు.

దరువు కలహమె కళ్యాణమని కౌతుకమునఁబలుకుచు
మెల్లనవీణెవాయించుచు మేలైననారదుఁడువచ్చె ౧

మేనంతవిభూతిఁబూసి మెఱుఁగుజడలముడివేసి
దాసవారిన్మరణజేసి తాండవమాడుచు వెడలెఁదపసి. ౨

సూ. వ.: అవురా, యీవిధంబున నీరీతివచ్చిన నారదునికి వందనమాచరించిన సత్యభామనుజూచి నారదుఁ డాశీర్వాదము సేయఁగా నా సత్యభామ నారదునితోఁ బలికేమార్గంబు పరాకు.

సత్య. వ.: వినవయ్యా నారద మునిచంద్రా! మీకు సకలమును దెలిసి యుండునే. నన్నెల్లప్పుడు విష్ణు వెడఁబాయక యుండుట కుపాయము దెలుపవయ్యా.

నార. వ.: వినవమ్మా సత్యభామ! యే దానముఁజేసిన నా దానఫలము లభించును. అదియేలాగంటే, యిప్పుడు పురుషదానముఁజేసిన నీ పురుషుఁడైన శ్రీకృష్ణుఁడు నిన్నెడఁబాయకుండును. ఇదే యుత్తమదానము. ఇందుకుఁ బురుషుఁడు స్త్రీకి లోకువైయుండిన నీదానము కొనసాగును. ఇంతకన్న వేరె యుపాయములేదు.

సత్య. వ.: వినవయ్యా నారద! నే నేడిచెప్పిన నది వినును. కృష్ణుఁడు, ఇప్పుడు తనకే లోకువై యున్నాఁడు. నేడు నాయింటికి వచ్చే వరున. ఆయన రాఁగానే యీకార్యమాయనకుఁదెల్పి యీదానము సేయుచున్నాను. మీరు సుముహూర్తము విచారించుకొని యుండరయ్యా.

నార. వ.: మహాభాగ్యమాయె నమ్మా.

సూ. వ.: అవురా, యీ విధంబున నా కృష్ణదేవుఁడు సత్యభామ యింటికి వచ్చే వరుసగనుక సకలాలంకార శోభితుఁడై వచ్చేమార్గంబే విధానసంటేను.

ద్విపద నీలాంబుదచ్ఛాయ నిరసించుమేన
మేలైనసొమ్ములు మెఱుఁగులీనఁగను

బహుగంగఁ గాంచనాంబరము ధరించి
కరమున రత్నకంకణములు సెలఁగ
మేటిగాఁగస్తూరి మేనను బూసి
దీటులేకచెలఁగు తిలకఁబుదిద్ది
వేణుగానంబులువిని మేనుమఱచి
మానినీమణులెల్ల మరులు గొనంగ
దేవదేవుఁడు కృష్ణదేవుఁడు నిపుడు
వేవేగలీలగా వెడలె వింతగను.

సూ. వ. : అవురా, యీ విధంబున నాకృష్ణదేవుఁడు సత్యభామవద్దకు వచ్చే మార్గంబు పరాకు.

దరువు వింతగా రత్నాలకొండె చెంతను నెమలిఫించము
ఎంతయుఁదేజరిల్లఁగ సంతసమున
పంతముమీఱ గోపాలబాలకులు గొలువఁగ
ఝుంతరికిట ధిమికిటతక ధళాంగు ఝుసురుఝుసుధణతక
యనియాడుచు ౧

కనకమయమయిన భూషణములు దనరఁగ
దినకరకోటితేజుఁడు దేవదేవుఁడు
వనజలోచనుఁడు యశోదతనయుఁడైన శ్రీకృష్ణుఁడు
ధణధణధిమిధిమి ఝునుఝునుధణతక
ధళాంగుధిమికిటయని యాడుచు ౨

దరువు ముందుగఁబాదములందును రత్నాల యందెలుగజ్జెలును
పొందుగమ్రోయ గోవిందుఁడు వింతగ ధింధిమిధిమిధిమియనుతా
ఆడినిచూడరె గోవిందుఁడు ౧

నందనందనుఁడు గోవిందుఁడు మోమునమందహాసముమీఱఁగా
పొందుగమొలనున్న మువ్వలుమ్రోయఁగా
ధంధణంధణధణయనుతా ఆడినిచూడరె గోపాలుఁడు. ౨

సూ. వ. : అవురా, యివ్విధంబున నీరీతి వచ్చిన కృష్ణుని సత్యభామ యెదుర్కొని పిలిచే మార్గంబు పరాకు.

దరువు రావయ్యా రావయ్యా కృష్ణ రతిఁగూడుందాము
ఈవేళనేను నీరాక కెదురెదురి చూచుచుంటి ౧

నేటికినిచ్చటికిని నేనువచ్చుదాన నీమాటతప్పకవచ్చితి
బోటులలో మేటినైతి. ౨

సూ. వ.: అవురా, యీవిధంబున నా సత్యభామ కృష్ణు నెదుర్కొని పతిని నొక విన్నపంబడిగే మార్గము.

ద్విపద
వినవయ్య కృష్ణ నా విన్నపంబొకటి
తనరదానాలు నీదయనుజేసితిని
యాదానఫలముల నందితిఁజాల
మేదినిలోనిఁక మీకటాక్షమున
నిప్పుడు నాకోర్కె లీడేరవలయుఁ
జెప్పెదనది నీవు సేసెదననుచు
నభయమిచ్చితివేని .......... నేను
విభవంబుమీఱంగ వివరింతుదేవ.

సూ. వ.: అవురా, యీవిధంబునఁ బలికిన సత్యభామ వాక్యంబులు విని యా కృష్ణదేవుఁడు పలికే మార్గము పరాకు.

దరువు
బోటియీవింతమాటలేలాడేవే, పోవే, నాగుణమెఱుగవ
నేటిదాఁక నీవుసెప్పినదెల్ల జవదాటినానటవే ౧

కలనైనఁగాని నవ్వులకైనఁగాని కలికిరో పరియాచకములకైనఁగాని
ఎలమి నీవుకోరినకోర్కె గాదని నేనేమైనఁబలికినానటవే ౨

కంజాక్షి నీకు నాగుణముదెలియదా యదిగాక నేనేమైన వింతవాఁడన
ముంజేతికడియాని కద్దమువలెనా ముగుద నామనసెల్ల
నీయందుండంగ 3

పణఁతిరొ తనువులు భేదమైనఁగాని ప్రాణములొక్కటిగాదా మనకు
అనుదినము నీవు నన్నామునొన్నగాని యదినీకుఁజెల్లదటవెభామ. ౪

సూ వ.: అవురా, యీవిధంబున మాధవుని మధురవచనంబులు విని, సంతోషభరితాంతరంగురాలై, యానత్యభామ కృష్ణునితోఁ బలుకరించే మార్గంబు పరాకు.

దరువు
ఇవుడు నాకోర్కె నీవు చెల్లించకపోతే
ఎవరు చెల్లింతురయ్యా నాసామి
తపములు దానములు సేయఁగ నీవంటి
ధవునిఁబొందితినయ్య సామి ౧

నాపెన్నిధానము నీవెనుమ్మీ స్వామి
నాప్రాణబంధువు నీవే సుమ్మీ!
నాపాలిదైవము నీవెనుమ్మీ స్వామి
నాప్రాణపదము నీవెనుమ్మీ ౨

నామేని చెలికాఁడు నీవెనుమ్మీ స్వామి
నామెచ్చువలరాజు నీవెనుమ్మీ
నామనోరథము నీవెనుమ్మీ సామి
నన్నేలే రాయఁడవు నీవెనుమ్మీ. 3

కృష్ణ. వ. : ఇదేమే సత్యభామ! యెన్నఁడు లేని వింతలు దలపెట్టితివి. ఇదేమి తెలియఁజెప్పవే.

సత్య. వ. : వినవయ్యా కృష్ణా! నారదుఁ డిప్పుడిక్కడకు వచ్చియుండెను. ఆయనను గొన్ని ధర్మరహస్యా లడిగితిని. కొంత దానకల్పక మడిగితిని. అందు కాయన పలుకరించినది, యేదానము చేసిన నా దానఫలము లభించునని చెప్పెను. అందుకు నేను మిమ్ము నెల్లపుడెడఁబాయకుండవలెనని యడిగిన నాయన పురుష దానము సేయుమనె నందుకు దేవరవారి యప్పనయయితే నట్లనే సేసెదనయ్యా.

కృష్ణ. వ. : వినవే భామామణి మంచి తలంపుఁ దలంచితివి. వేయివేల కాలాల కున్ను నీవే స్త్రీవి, నేనే పురుషుఁడనుగా నుండవచ్చును. నా మనసులో మునుపు గానే దోచెను. నీతోఁ జెప్పిన నేమందుపోయని వెఱచియుంటిని. ఈ కార్యము నీవే నాతోఁ జెప్పియుంటివి. నాకుఁ జాలా సంతోషమాయెను. అటులనే చేసికొనవే భామామణి.

సత్య. వ. : ఎవరురా కటికవాఁడా! దానము దీసికొనుటకు బ్రాహ్మణులను బిలుచుకొని రారా.

కటిక వ. : మహాభాగ్య మాయెనమ్మా!

సూ. వ. : అవురా, యీ విధంబున, నా సత్యభామ దానము చేయుచున్న దని యా బ్రాహ్మణులు వచ్చేమార్గము పరాకు.

దరువు పంచాంగాలు సేతఁబట్టి పట్టె వర్ధనాలు పెట్టి
మంచనభట్లు మొదలగు మహనీయులు వచ్చిరి.

బ్రాహ్మ. వ. : వినవమ్మా, సత్యభామా! యేయే దానములు సేయుచున్నావు తెలుపవమ్మా.

సత్య. వ. : ఇదిగో, యీ కృష్ణుని దానము సేయుచున్నాను, దీసికొనరయ్యా.

బ్రాహ్మ. వ. : భళా భళా షోడశ మహాదానాలు సేయుచున్నావని వచ్చితిమి. నీ వదంతా సేయక కృష్ణుని దానముసేసిన నెవడు తీసికొనేవారు లేరు. ఏలనంటే, యీయనకుఁ బాలు, పెరుగు, వెన్న, మంచి బోజనము గావలెఁ బట్టుపీతాంబర ములు గావలె. ఇదిగాక నిత్యము పదిమంది స్త్రీలు గావలె. ఇదంతా మేమెక్కడఁ దెత్తుము. కాఁగా నా కృష్ణునితోఁగూడఁ జతుర్దశ భువనాలు ధారవోసిన మాకు వద్దమ్మా.

సూ. వ. : అవురా, యీ విధంబున నీరీతిఁబలికిన బ్రాహ్మణుల వాక్యంబులు విని యా సత్యభామ నారదునితోఁ బలికే మార్గము.

నార. వ. : వినవోయి, బలభద్ర! దానము చేసిన పదార్థముఁ దిరుగ నడుగునది న్యాయము గాదు. నీవైతే చాల యంగలార్చు చున్నావు. గనుక నొప్పితిని. ఈ కృష్ణుని నొక తట్టలోనుంచి వీనికి సరిగా బంగారు దూచి యిచ్చిన నీ కృష్ణుని నిచ్చెదను.

బల. వ : అవశ్య మారీతిగానే యిచ్చెదను. మన నగరికిఁ బోవుదము రావయ్యా.

సూ. వ. : అవురా, యీ విధంబున నా బలభద్రుఁడు నారదుని గృష్ణునిఁ దోడ్కొని తన నగరంబునకు వచ్చె మార్గంబు పరాకు.

దరువు చెలువుగఁ బక్కని శ్రీకృష్ణునిఁ గూడి
కలహాశనుఁడు వచ్చె గ్రక్కున నగరికి

సూ. వ. : అవురా, యీ విధంబున బలభద్రుఁడు నారదునిఁ దోడ్కొని వచ్చినవాఁడై దన బొక్కసములో నుండు ధనమును గృష్ణుని బొక్కసములో నుండు ధనమునుఁ దెమ్మనఁగాఁ గింకరులు ధనము నెత్తుకొని వచ్చు మార్గంబు పరాకు.

దరువు కింకరులెల్ల గుంపుగూడి సంకష్ట ధనము నెత్తుకొని మెల్లనె
పొంకిగా జననాథు సభకుఁ దెచ్చిరి కొంకక యేలెలో యేలెలో
యనుచు. ౧

కింకరుల వ. : స్వామి ధన మొక తట్టలో వేసితిమి. కృష్ణుని నొక తట్టలోఁ బెట్టి తూచితిమి. ధనముండు తట్ట యెగువనున్న, కృష్ణుఁడుండు తట్ట దిగువుగా నున్నది.

సూ. వ. : అవురా, యీవిధంబున బలరాముని బొక్కసము ధనముఁ గృష్ణుని బొక్కసముఁ దెచ్చివేయఁగాఁ జాలకపోయెనని బలభద్రుఁ డష్టమహిషు లనుజూచి పలికే మార్గంబు పరాకు.

బల. వ. : వినరే యష్టమహిషులారా! మాబొక్కసపు ద్రవ్యము కృష్ణుని బొక్కసపు ద్రవ్యము దెచ్చివేసినఁ జాలకపోయెను. మీకుఁ గృష్ణుఁడు గావలసిన మీయింష్లనుండు ధనము, సొమ్ముసొమ్ముంఘాలు దెచ్చివేసి విడిపించుకొనరే.

అష్ట. వ. : మంచిదయ్యా బావా. మేమే విడిపించుకొనెదమయ్యా. ఎవరురా కింకరులు మాబొక్కసములోనుండే ద్రవ్యాదులన్నియుఁ దెచ్చివేయరా.

కింక. వ. : అమ్మలారా మాజాగు.

సూ. వ. : అవురా. యీవిధంబున నాయష్టమహిషులు దమ బొక్కసములో నుండే ద్రవ్యముఁ దెమ్మని యానతిచ్చిరి గనుక నాకింకరులు ధనము నెత్తుకొని వచ్చె మార్గంబు పరాకు.

పూర్వపుదరువు కింకరులెల్లఁగూడి॥ గుప్త.
అంతాదెచ్చివేసేది, అపయాళము.

సత్యభామను జూచి పలికే మార్గం.

దరువు ఎంత నంగనాచివే యో సత్య నీవు
ఇంతులలోనెల్ల వింతరక్కసివి గావ
ఒరుల సొమ్మును నీవు నూరకె యిటువలె
గరిమను ధారవోయఁ గారణమేమే జంత ౧

ఎక్కువ హానిసేసి, యెఱుఁగనట్లు నున్నావు
రక్కసి, దివాకరుతాద్భుతా యన్నట్లు ౨

తొయ్యాలివా నీవు తొయ్యాలులఁ బట్టిన
దయ్యమే గాకుంటె యిట్టితలఁపుఁ దలఁతువటవే. 3

సూ. వ.: అవురా, యీ విధంబునఁ బలికిన, యష్టమహిషుల వాక్యంబులు విని యా సత్యభామ పలికే మార్గంబు పరాకు.

దరువు కలహకంటకులారా! యీ కంటుమాటలేలానే, నా
చెలువుని నేను దానము సేసితిఁబోవె ౧

దార నీ వెట్లవుదువె దానవారి శ్రీకృష్ణుఁడు
ఒకరి సొమ్మటె దెలుపవె చుప్పనాతి ౨

తప్పుమాటలాడకురె దవడఁ గొట్టఁబొయ్యేగాని
చెప్పిన, శ్రీకృష్ణుఁడు దనసొమ్ము గాదటె 3

పట్టపురాణి రుక్మిణి ప్రాణేశుఁడంటె చెల్లు, యీ
వట్టి మాటలేలె తలమెట్టఁ బొయ్యేము ౪

మాటలే లాడరె, యిఁక మీ మనసు ముట్టి చూచుకోరె
పాటించి యిఁక నే మీకు భయపడుదున ౫

చాలుఁజాలు నిఁకను వట్టి జగడమేలె రంపెలాడి
వాలాయముగఁ జల్లఁగా వర్ధిల్లు మింక. ౬

సూ. వ.: అవురా, యీ విధంబున స్త్రీలు గుంపుగూడి పరస్పర కలహము సేయుచుండు సమయంబున నా నారదుఁడు వారలను నిగ్రహించి పలికిన వాఁడై యా కృష్ణు నచ్చట నుంచుకొనియున్న నష్టమహిషులు దోచుకొనిపోవుదురని తన యాశ్రమమునకు శ్రీకృష్ణునిఁ దోడ్కొని వచ్చే మార్గం పరాకు.

దరువు చెలువుగఁ జిక్కని శ్రీకృష్ణునిఁ గూడి
కలహాశనుఁడు వచ్చెఁ గ్రక్కున నాశ్రమానికి. ౧

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణునిఁ దోడ్కొని నారదుఁడు దన యాశ్రమానికి వచ్చు నవసరంబున నా వార్త విని బలభద్రుఁడు కోపగ్రస్తుఁడై వెడలి వచ్చే మార్గంబు పరాకు.

దరువు మేలైన సొమ్ములు చాల మెఱయ ఫాలాక్షుడన
నీలాంబరుఁడు వచ్చె నెఱియ వేడుకను. ౧

సూ. వ.: అవురా, యీ విధంబున వచ్చిన బలరాముఁడు నారదునితోఁ బలికే మార్గం.

బల. వ.: వినవోయి, నారదమునిచంద్ర! యీ పని చిన్న వాండ్లకు నెక్కడ లేని ధర్మశ్రవణాలు దెలిపి కృష్ణునిఁ దోడ్కొని పోవునది నీకు ధర్మముగాదు. విడిచి పెట్టి పోతే తప్పితివి లేకపోతే నా వర్తమాన మెఱుఁగుదువే. ముసలముచేత వీపంతా పెట్లగొట్టుదునా యేమి.

నార. వ.: వినవోయి, బలభద్ర! నేను బలవంతముచేసి తోడ్కొని పోలేదు. ఈ వృత్తాంతమంతయుఁ గృష్ణునడిగి తెలిసికొనుము.

సూ. వ.: అవురా, యీ విధంబున నారదుని వాక్యంబులు విని యీ బలభద్రుఁడు కృష్ణునితోఁ బలికే మార్గంబు పరాకు.

ద్విపద ఓరోరి రావో ... ... ... ... ... ...
ఈ రీతి వెఱ్ఱి మునీంద్రుని వెంటఁ
బోవఁగ నేమి నీ బుద్ధి యేమాయె
భావింపఁగా వెఱ్ఱి పట్టెనా నీకుఁ
జలమునఁ జొక్కు పొ(డి) చల్లిరో లేక
పిలిచినఁ బలుకవు భీతి చెందెదవు
వెఱవక యదియెల్ల వేగమె దెలుపు
మరలింతు నదియెల్ల మనను రంజిల్ల.

సూ. వ.: అవురా, యీవిధంబున నీరీతిఁ బలికిన బలరాముని వాక్యంబులు విని కృష్ణుఁడు పలికే మార్గం.

కృష్ణ. వ.: వినవోయి, యన్నా, నాకు వెఱ్ఱి పట్టలేదు. ఈ మునీశ్వరుఁడు బలిమినిఁ బిలుచుకొని పోలేదు. సత్యభామ నన్నెల్లప్పు డెడబాయకుండవలెనని యితనికి దానము సేసెను. కాఁగా నితని యధీనమై వెంబడిఁ బోవుచున్నాను.

సూ. వ.: అవురా, యీ విధంబున నీరీతిఁ బల్కిన కృష్ణుని వాక్యంబులు విని బలరాముఁడు నారదునితోఁ బలికే మార్గం పరాకు.

బల. వ.: వినవయ్యా, నారదమునిచంద్ర! యీ వర్తమానము దెలియక నేనొక మాట పలుకరించితిని. అందుచేత మీరు కోపము సేయవద్దు. సత్యా, కృష్ణుఁడు, పసివాండ్లు గనుక నిటువంటి కార్యము సేసిరి. ఎట్లైనా మా కృష్ణుఁడు మాకు వచ్చుట కొక యుపాయము సెప్పవయ్యా!

నార. వ.: వినవోయి, బలభద్ర! దానము చేసిన పదార్థముఁ దిరుగ నడుగునది న్యాయము గాదు. నీవైతే చాల యంగలార్చు చున్నావు. గనుక నొప్పితిని. ఈ కృష్ణుని నొక తట్టలోనుంచి వీనికి సరిగా బంగారు దూచి యిచ్చిన నీ కృష్ణుని నిచ్చెదను.

బల. వ.: అవశ్య మారీతిగానే యిచ్చెదను. మన నగరికిఁ బోవుదము రావయ్యా.

సూ. వ.: అవురా, యీ విధంబున నా బలభద్రుఁడు నారదుని గృష్ణునిఁ దోడ్కొని తన నగరంబునకు వచ్చే మార్గంబు పరాకు.

దరువు చెలువుగఁ బక్కని శ్రీకృష్ణునిఁ గూడి
కలహాశముఁడు వచ్చె గ్రక్కున నగరికి

సూ. వ.: అవురా, యీ విధంబున బలభద్రుఁడు నారదునిఁ దోడ్కొని వచ్చినవాఁడై దన బొక్కసములో నుండు ధనమును గృష్ణుని బొక్కసములో నుండు ధనముమఁ దెమ్మనఁగాఁ గింకరులు ధనము నెత్తుకొని వచ్చు మార్గంబు పరాకు.

దరువు కింకరులెల్ల గుంపుగూడి సంకష్ట ధనము నెత్తుకొని మెల్లనె
పొంకిగా జననాథు సభకుఁ దెచ్చిరి కొంకక యేలెలో యేలెలో
యనుచు. ౧

కింకరుల వ.: స్వామి ధన మొక తట్టలో వేసితిమి. కృష్ణుని నొక తట్టలోఁ బెట్టి తూచితిమి. ధనముండు తట్ట యెగువనున్న, కృష్ణుఁడుండు తట్ట దిగువుగా నున్నది.

సూ. వ.: అవురా, యీవిధంబున బలరాముని బొక్కసము ధనముఁ గృష్ణుని బొక్కసముఁ దెచ్చివేయఁగాఁ జాలకపోయెనని బలభద్రుఁ డష్టమహిషు లనుజూచి పలికే మార్గంబు పరాకు.

బల. వ.: వినరే యష్టమహిషులారా! మాబొక్కసపు ద్రవ్యము కృష్ణుని బొక్కసపు ద్రవ్యము దెచ్చివేసినఁ జాలకపోయెను. మీకుఁగృష్ణుఁడు గావలసిన మీయింట్లనుండు ధనము, సొమ్ముసొమ్ములు దెచ్చివేసి విడిపించుకొనరే.

అష్ట. వ.: మంచిదయ్యా బావా. మేమే విడిపించుకొనెదమయ్యా. ఎవరురా కింకరులు మాబొక్కసములోనుండే ద్రవ్యాదులన్నియుఁ దెచ్చివేయరా.

కింక. వ.: అమ్మలారా మాబాగు.

సూ. వ.: అవురా. యీవిధంబున నాయష్టమహిషులు దమ బొక్కసములో నుండే ద్రవ్యముఁ దెమ్మని యానతిచ్చిరి గనుక నాకింకరులు ధనము నెత్తుకొని వచ్చేమార్గంబు పరాకు.

పూర్వపుదరువు కింకరులెల్లఁగూడి॥ గుప్త.
అంతాదెచ్చివేసేది, ఆపయాళము.

సూ. వ.: అవురా, యీవిధంబున నందఱు ధనము దెచ్చివేసినను జాలక పోయెఁగనుక నా యష్టమహిషులు బలరామునిఁజూచి పలికేమార్గం.

అష్ట. వ.: వినవయ్యా బావా! మాసొమ్ముంతయుఁదెచ్చివేసితిమి. ఈ పాప జాతి సత్యనుంచి యెంతమోసము వచ్చెను. మాసొమ్ముంతయుఁ బోయెను. మేమేమి సేతుమయ్యా.

సూ. వ.: అవురా, యీవిధంబున నా యష్టమహిషులు నీరీతి రోనవుమాట లాడఁగా విని యానత్యభామ బలరామునితోఁ బలికే మార్గం.

సత్య. వ.: వినవయ్యా బావా! వీరలీరీతిఁ బలుకఁగారణమేమి. నాకు మా తండ్రియిచ్చిన రత్నాలు ధనము చాలనున్నది. అదంతయుఁ దెచ్చివేసి నేనే విడి పించుచున్నానయ్యా.

బల. వ.: వినవే సత్యభామా! యెట్లయినను మాకృష్ణుఁడు మాకు వచ్చినఁ జాలును.

సూ. వ.: అవురా, యీవిధంబున నా సత్యభామ దనయింటనుండు ద్రవ్య మంతయుఁ దెచ్చివేయఁగా, నా కృష్ణుఁడుండు తట్ట యణుమాత్రమైనఁ గదలకున్నఁ జూచి సంకోచపడియుండఁగా నావార్తవిని యశోదాదేవి తన బొక్కసమునునుండు ద్రవ్యము పట్టించుకొని కృష్ణదేవుని విడిపింపవచ్చే మార్గం పరాకు.

దరువు

యశోదాదేవివచ్చె సొగసుమీఱఁగ
చొక్కమయిన బంగారు చెక్కుల కాంతిమీఱఁగ
ముక్కున నాణిముత్యపు ముంగరతేజరిల్లఁగ ౧

చిన్నిమోమునగవులు వెన్నెలనిండికాయఁగ
తిన్ననిసొమ్ములు మేనఁజెన్నుఁగ విలసిల్లఁగ. ౨

సూ. వ.: ఈవిధంబున యశోదాదేవివచ్చి తనబొక్కసములో నుండే ధన మంతయు వేయఁగాఁ జాలకపోయెఁగనుక బలరాముఁడు నారదునితోఁ బలికే మార్గం.

బల. వ.: వినవయ్యా నారద! సకలమైన ధనమంతయుఁ దెచ్చివేసితిమి. మాచేతనిది నిర్వహణానికిరాదు. కోకలు పాత్రలు నున్నవి. తెచ్చివేయుమనినచో సెసెదము. (నారదుఁడు కోపగించుకొనేది.) అడయాళం.

సూ. వ.: అవురా, యీవిధంబున సకలమైన ధనముదెచ్చి వేయఁగాఁజాలక పోయెఁగనుక నందఱు చింతాక్రాంతులుగా నుండఁగా నావలికథా వృత్తాంతంబే విధానసంటేను. ఆ పురజనులందఱు కృష్ణుని విడిపించెదమని తమతమయిండ్లలో నుండే ధనము, పాత్రలు, బట్టలు, చిక్కుచిలువాన మెత్తుకొనిరాఁగాఁ దొలుత విప్రులు వచ్చేమార్గము.

దరువు పట్టెవర్ధనాలుపెట్టి (పూర్వపు దరువు గుర్తు)

సూ. వ. : అవురా, యీవిధంబున నా బ్రాహ్మణులు తమతమ వస్తువులు దెచ్చివేసినతరువాత నా పట్టణములోనుండే కోమట్లు దమవస్తువులు దెచ్చే మార్గం.

దరువు సారెకుచిట్టులు, అడ్డలు పళ్ళును నంచిచేఁబట్టి
బేరసారములాడుచువచ్చిరి పెద్దకోమట్లు.

సూ. వ. : అవురా, యీవిధంబున నా కోమట్లు దమతమ చిక్కుచిల్లను దెచ్చినింపఁగాఁ జాలకపోయెఁగనుక, నాజ్ఞాతులు గొల్లలు దమకుఁగల వస్తువులు దెచ్చివేసే మార్గం.

దరువు నల్లకంబళి గొంగళ్ళు
చిల్లకోలలు దెచ్చిరిపుడు
గోవిందుని విడిపింపను.

పురజనులు వ. : వినవయ్యా బలభద్రా! మాకుఁగలిగిన బట్ట, పాత్రలు, చెంబులు, కంబళ్ళు, అడ్డలు, ముంతలు, టెంకాయచిప్పలు వెదురడ్డలు మొదలైన దంత వేసితిమి. అందువలనఁ గదలుసటుల నుండలేదయ్యా.

సూ. వ. : అవురా, యీవిధంబున నానకలమైనవారునారదుని నడిగికొనంగా, నారదుఁడు కృష్ణుని విడవనోపననఁగా నా పురజనులు దమసర్వస్వము పోయెనని తమలోఁదాము పలికేమార్గం.

దరువు తాతలనాటి ధనముపోయెఁ దందనాన, కృష్ణుని
దపసి విడువఁడాయె దందనాన ౧

వెలహెచ్చు రత్నాలుపోయెఁ దందనాన
కృష్ణుని వెఱ్ఱితపసి విడువఁడాయెఁ దందనాన ౨

కానుపీనమెల్లఁబోయెఁ దందనాన, కృష్ణుని
దాసివృత్తుఁడు విడువడు తందనాన 3

చెంబులు చెరువలువోయె, తందనాన, కృష్ణుని
చెత్తవృద్ధముని విడువఁడు, తందనాన ౪

ఆవికలు చీరలుపోయె, తందనాన
కృష్ణుని రక్కసిముని విడువఁడాయె, తందనాన ౫

వక్కలాకులతిత్తి పోయెఁదందనాన
మొలనుబెట్టిన పొగచుట్ట పోయెఁదందనాన ౬

సొమ్ముకుసొమ్ములు వోయెఁదందనాన
తమకు ధిమ్ముకుధిమ్ముకు పట్టెను తందనాన ౭

అనువైన వస్తువులుపోయెఁ దందనాన, కృష్ణుని
మునిభల్లూకము విడువడు తందనాన ౯

ముత్యాలు, పగడాలుపోయెఁ దందనాన, కృష్ణుని
మొండి .... ముని విడువఁడు తందనాన ౯

వింతవింతసొమ్ములుపోయె తందనాన, కృష్ణుని
విడువడు మునిమర్కటము తందనాన ౧౦

చీనిచీనాంబరములుపోయెఁ దందనాన, కృష్ణుని
జీర్ణా ... ... విడువఁడాయెఁ దందనాన ౧౧

పట్టుపీతాంబరములుపోయెఁ దందనాన, కృష్ణుని
పరగమునికోతి విడువడు తందనాన ౧౨

విడువమంటే కొంటెముని విడువడు తందనాన, కృష్ణుని
విడిపించేది యేలాగింక తందనాన ౧౩

సత్యనుండి మోసమువచ్చెఁ దందనాన
కృష్ణుఁడు సరసములోనై బాధదెచ్చెఁ దందనాన ౧౪

తనకుఁ గృష్ణుని లొంగఁజేసెఁ దందనాన, యిది
మనకు నెంతబాధదెచ్చెఁ దందనాన ౧౫

మాయనెఱుఁగక మోసపోతిమి తందనాన
ఇఁక మనకేమిగతిగాఁబోయెని తందనాన ౧౬

ఇపుడు రక్షించువారెవరు తందనాన
మనమేలాగు శుభమునొందెదము తందనాన. ౧౭

సూ. వ. : అవురా, యీవిధంబునఁ బురజను లాద్యంతమున్ను చింతాక్రాంతులై పలుకఁగా, నా బలభద్రుఁడు కరణీకునిఁ బిలుచుకొని రమ్మనంగా, నా కరణీకుఁడు వచ్చేమార్గం పరాకు.

దరువు పండ్లుతెఱచుకొని పకపకనగుచుఁ బునుళ్ళ
కండ్లుతెఱచుచుఁ గుంటికరణమువాఁడువచ్చెను.

(కటికముఖాంతరము)

కరణీ. వ. : శరణు శరణయ్యా స్వామి.

బల. వ. : వినరా కరణీకుఁడా, ఎవరిసొమ్ములు వచ్చెను. ఎవరెవరిసొమ్ములు రాలేదు గణితము, సూడరా.

కరణీ. వ.: స్వామి, రుక్మిణీదేవి వినాగా మిగిలిన వారిదంతయు వచ్చి యున్నది.

సూ. వ.: అవురా, యీ విధంబున బలరాముఁడు కరణీకుఁడు పలికిన వాక్యంబులు విని రుక్మిణీదేవినిఁ బ్రార్థింపగా నా రుక్మిణీదేవి కృష్ణదేవుని విడిపింప వచ్చే మార్గంబు పరాకు.

[పూర్వపు ద్విపద॥ శోభిల్లు రుక్మిణి శోణాక్షురీవి]

దరువు ఒయ్యారమున వెడలెను అందముమీఱ
నొయ్యారమున వెడలెఁదియ్య విల్తు శరమనఁగ
డొయ్యాలు లందఱు గొల్వ నొయ్యాన రుక్మిణీదేవి. ౧

సన్నని పయ్యెదలోనఁ జిన్ని చన్నులు చెలఁగఁ
జున్నమ చందురు నరిబోలు మోము వెలుఁగఁగ. ౨

సూ. వ.: అవురా, యీ విధంబున వచ్చిన రుక్మిణీదేవిని నాపె దెచ్చిన వస్త్రవులను జూచి యీ సకలజనులు పరియాచకముగాఁ బలికే మార్గం.

దరువు ఎంత హామికె తే వచ్చె నీ రుక్మిణి యిప్పుడు నీటుగ
వింతకెల్లఁ జూడరమ్మా. ౧

ఆరచేయంత తట్టలో నేమో మూనుకోవచ్చె
నందువల్ల విడిపించె దాశ్చర్యము. ౨

ఎంత తెచ్చునో ధనమేమున్నదో యనియుంటిమి
అంత జయలాయె నమ్మలార. ౩

కొండంత ధనముకెల్లఁ గొంతవలె నుండఁగ
నిందువల్ల నేమిగాఁ బోయిని. ౪

హారమున నావంజ వేసినకీర్తి
నళియ దెచ్చిన వస్తువంతె. ౫

సూ. వ.: అవురా, యీ విధంబున సకలజనులు పరియాచకము సేయుచుండు సమయంబున, నా రుక్మిణీదేవి నారదునికిఁ గృష్ణునికి మంగళహారతి సేసే మార్గం పరాకు.

దరువు జయమంగళం శుభమంగళం
మంగళం మంగళాకార మూర్తికిని
మంగళం విశాల కీర్తునికిని
మంగళం నిజభక్త పాలనైక ప్రీతునికి

మంగళం పాండవా సారథికిని
జయమంగళం శుభమంగళం. ౧

సూ. వ.: అవురా, యీ విధంబున నా రుక్మిణీదేవి యీ రీతిఁ ప్రదక్షిణ నమస్కారము సేసి, యా తట్టలోనుండే ధనమాద్యంతమున్ను......తాను దెచ్చిన తులసీదళము నా తట్టలో నుంచగానే, యా కృష్ణుఁడుండే తట్ట, పొడవుగా నున్న తులసిదళముంచిన తట్టక్రిందుగా నుండగాను, సకలజనులును సంతోషమంది యుండు సమయంబున, నా సకలమైన ధనమున్ను సొమ్ము సొమ్ముంథమున్ను తెమ్మని యా బలరాముఁడు వారివారి సొమ్మెత్తుకొని పొమ్మనఁగా వారువారు సంత సమునఁ దమతమ సొమ్ము గుర్తులు సెప్పి గైకొనే మార్గంబు పరాకు.

దరువు ముత్యాల కుతికంటు యిది నాదిపోవె
ముదిత మా బావ యిచ్చినది గాదటవె. ౧

కెంపుల కమ్మలు యివి నావి పోవె
ఇంపుగ మా తల్లి చేసి యిచ్చినవిగాదటె. ౨

పచ్చల కడియము లివి నావి పోవె
పడుచా! పెండ్లిలో నిన్న యిచ్చినవి గాదటె. 3

హెచ్చువెల ముక్కర, యిది నాది పోవె
మెచ్చి కృష్ణుఁడు మొన్న యిచ్చినది గాదటె. ౪

సందిటి దండలు ఇవినావి పోవె
సవతి నా తాత, యిచ్చినవి గాదటె. ౫

అందెల జోడు ఇదినాది పోవె
అటుటో యత్త సమర్తాడినప్పుడిచ్చినది. ౬

రత్నాల పదకము లివి నావి పోవె
రం......త మాతండ్రి యిచ్చినవి గావటె. ౭

సూ. వ.: అవురా, యీ విధంబున, నా యష్టమహిషులు దమతమ సొమ్ము సొమ్ముంథాలు గుర్తు సెప్పి తీసికొన్న తదనంతరంబున సకలమైన జనులు దమతమ వలువలు......ల్వానము గుర్తు సెప్పి యెత్తుకొనే మార్గం.

దరువు పట్టుపీతాంబరము నాది పలుకకురి
వేడ బేరాన వచ్చిన...........
మనత కానవచ్చె పోరా నీవు చాలుఁజాలు. ౧

కంచిదోవతిజోడు నాది మంచిదిగా, నా పెండ్లిలోఁ గొన్నది
పంచెలివి నావినీవు మించియ......చాలుఁజాలు. ౨

చెంబులు చెరువలు నావి చేరకురా మొన్న నంతలోఁ గొన్నవి
కంబళ్ళు గిన్నెలు నావి కంచములు నావి, యంటకుర
చాలుఁజాలు. 3

సూ.వ.: అవురా, యీ విధంబున నీరీతి నకలజనులు దమతమ సొమ్ము లెత్తుకొని నంతోషమంది, యీ రుక్మిణీదేవిని స్తోత్రము చేసేమార్గంబు వరాకు.

దరువు మాపాలి దైవము, మా పెన్నిధానము
మా...్రప నీవెనుమ్మి రుక్మిణీదేవి. ౧

చక్కని తల్లివి సాక్షాత్తాదిలక్ష్మివి
నిక్కము రుక్మిణి నిను నుతింపనేర్తుమే. ౨

నత్య ధారవోసి నా సామిని విడిపింప
నిత్య యౌవనవతి నీవే చతురవమ్మ. 3

మానినీ నీవు మగువలకుఁ బ్రాణ
దానము సేసితి ధవుని విడిపించి. ౪

కులగిరులను బోలు కలధన మెల్లనీ
తులసీదళముతోడఁ దులఁదూగదాయెను. ౫

సూ. వ.: అవురా, యీ విధంబున నకలజనులు రుక్మిణీదేవిని స్తుతిచేయు చుండు నమయంబున, నా నారద మహా మునీశ్వరుఁడు దనలోఁదాను పలికే మార్గంబు పరాకు.

దరువు ఎంతని యాశించి.........గలిగెనని
వింతగా ..............హరా. ౧

ధనము నిండ వచ్చునని మనముగ నాశించియుంటిని
అ...............ది లేక సేసె. ౨
...............విరసమై నాదుల సాకుఁదెచ్చె

వరునగఁ గృష్ణు విడిపించి వరకీర్తిఁదెచ్చె. 3
హర హ......................
.........................

సూ. వ.: అవురా, యీ విధంబున.........న వాఁడై నంతోషభరితాం తరంగుండై, యీ రుక్మిణీదేవిని స్తుతిగాఁ బలికే మార్గంబు పరాకు.

దరువు వినవమ్మ రుక్మిణి..........
.........గదవమ్మ నీవు. ౧

చనవున ధర్మ పరిపాలనము సేసితివి
చందురువలెఁ గీర్తిఁ బ్రకాశింపఁ జేసితివి. ౨

..................తివి
పరమప్రియుని విడిపించు కొంటివి. 3

అరమర లేక ధనమందఱికిఁ దీసియిస్తివి
సరసము. ..........

సూ. వ.: అవురా, యీ విధంబున నీరీతి నారదుఁడు స్తుతిసేయు సమయంబున సకలమైన సురమునులు నార.........మంగళములు పాడే మార్గంబు పరాకు.

దరువు మందర ధరునికి మాధవునకు
నందకుమారునకు నరహరికి
పొందుగ న...............
.........యశోద నందనునికి
శోభానె శోభనమె. ౧

భోసల శాహజి భూవిభుని
భాసిలు.........పాలించు
వాసిగ శోభన వైభవ సంతతి
ధీసంపదలిడు దేవునికి
శోభానె శోభనమె. ౨

సంపూర్ణము

# రామ పట్టాభిషేకము

రచయిత : శాహజి

# రామ పట్టాభిషేకము

జయ దశరథ పుత్ర జయరామ సుచరిత్ర
జయ దివ్యనుతి పాత్ర జయ జగన్మిత్ర ॥జయ॥
జయ శుభావహ గాత్ర జయ జగత్కృతి సూత్ర
జయభాను శశి నేత్ర జయ జితా మిత్ర ॥జయ॥ ౧

భువన వందిత చరణ పూతనా సంహరణ
సక్రమానుసరణ కువలయ హితచరణ
గోవర్ధనోద్ధరణ భవభయ నిరాకరణ
పాతకోత్తరణ ॥జయ॥ ౨

వేణునాద విలోల విబుధ సమ్మృత లీల
చాణూర మదజాల శాసనా భీల
బాణ భంజన శీల పావన గుణావాల
వీణాముని విశాల వినయానుకూల ॥జయ॥ 3

విమత భీకరశౌర్య వేదాంత నుతచర్య
యమి వినుత గుణధుర్య యదువంశ వర్య
కమనీయ గాంభీర్య కాంచనాచల ధైర్య
విమల మానసధార్య వినుత సౌందర్య ॥జయ॥ ౪

శరణు శరణు శరణు శరణు జగద్విధాయక

శరణు శ్రీహరి సాయక
శరణు శరణు శుభప్రదాయక
శరణు గిరిజా నాయక శరణు శరణు. ౧

వారణాసుర మద విదారణ దారుణాఘనివారణ
చారణస్తుత భువనకారణ చారుశుభద విచారణ. ౨

నిజపదాశ్రితపూత వానర నిఖిల దివిజాగ్రేసర
రజనిరమణ కళా విభాసుర విజితమత్త మహాసుర. 3

సర్వ సంభృత చరణ కింకర గర్వితారి భయంకర
పార్వతీ హృదయేశ శంకర భవహర క్షేమంకర. ౪

మంగళం

మహిషాసుర మర్దనితే మంగళం నిత్యం
మహిత శ్రీ వర్ధనితే మంగళం

అకళంక ఖేలనాయై యతిలోక పాలనాయై
మకరాంక లాలనాయై మంగళం ౧

ప్రణుత సంతోషితాయై భవ్య సంభాషితాయై
మణిగణ భూషితాయై మంగళం ౨

అహివైరి సేవితాయై హరిభావ భావితాయై
మహిత సంభావితాయై మంగళం 3

శహజేంద్ర పూజితాయై సజ్జన దీపితాయై
మహిమా విరాజితాయై మంగళం ౪

మహిషాసుర మర్దనితే మంగళం.

సూ. వ. : దేవతా ప్రార్థన.

శ్లో. లంబోదర స్సర్వ విద్యాలంబోదర హసన్ముఖః
బంధురస్స్ఫుత్వ సుగుణైర్బంధురస్తు భవన్ముదే.

సూ. వ. : అవురా, యీ విధంబున విఘ్నేశ్వరుని పాద పద్మములకు వందన మాచరించి యా తదనంతరంబున, మఱియే విధానవంటేను.

శ్లో. నృత్యాకారగతైః కరాబ్జవలనై స్తాలాయితైః కంకణ
ప్రక్వాణై శ్రుతికాంగతైర్ముఖ వలల్లోలంబ మాలారుతై
ర్వీణాయా మృదుగీతిభిః పరవశాశ్చాళీ జనాఃకుర్వతే
వాగ్దేవీ వదనాంబుజే నివసతు శ్రీ శాహ పృథ్వీపతేః.

సూ. వ. : అవురా, యీ విధంబున సరస్వతీదేవి పాదపద్మములకు వందన మాచరించి యా తదనంతరంబున మఱియు నే విధాన నంటేను.

శ్లో. చండస్తాండవ కాండ శౌండ మహిమా శుండాల తుండోన్నమ
చ్ఛుండా దండ పిచండ భాండ విహరత్కుండల్య ఖండశ్రియై
తండూద్దండిత చండ డిండిమ ముఖో డిండీర షండోద్వమ
త్కాండైర్మండిత గండ మండల జటా ఖండోఽస్తు చండీపతేః.

సూ. వ. : అవురా, యీ విధంబునఁ బరమేశ్వరు పాదపద్మములకు వందన మాచరించి యా తదనంతరంబున మఱియు నే విధాన నంటేను.

శ్లో. వందే తందేవదేవం వరసుర పటలీమౌళి మాణిక్యదీప
శ్రేణీ నీరాజిత శ్రీచరణ సరసిజ ధ్యానయోగాది భాజాం
భక్తానా మీప్సితార్థాకలన పటు చతుర్బాహు శోభాంచితశ్రీ
చక్రాబ్జాది ప్రభాభిశ్శమితి జగదఘం శాశ్వతం కృష్ణ దేవమ్.

సూ. వ.: అవురా, యీ విధంబున శ్రీకృష్ణదేవుని పాదపద్మములకు వందన మాచరించి యీ తదనంతరంబున మఱియు నే విధాన నంటేను.

శ్లో. శ్రీ యమురు దిశదాంతే శాహభూపాలమౌళేః
కలితశుభదయా సాకృష్ణదేవస్య వీక్షా
అభినవ వనమాలాఽఽమోద హృద్యాన వద్యా
నిలపరిచయ లబ్ధానంద భక్తవ్రజస్య.

శ్లో. శ్రీమానస్తు సశంకరో నిజ శిరశ్చంద్ర స్రుతాచ్ఛామృతా
ప్లావాకార బహిస్సముద్గత కృపానిష్యంద హృష్యజ్జగత్
అన్యోన్యాకృతిభేద దుస్సహగతిః [వాగర్థ] దాంపత్యభాక్
అన్వర్థాక్షర నామరూప విభవస్తే భూయసే శ్రేయసే.

శ్లో. శాహేంద్ర స్సకలానవద్య సుకళా పాండిత్య జాగ్రద్యశో
హారాలంకృత దిగ్వధూకుచతటీ కాశ్మీర చంచన్మహః
అత్రత్యాః కవయశ్చతుర్విధ మహాసాహిత్య నిర్వాహకా
స్సోఽహంచే ద్దశరూపకాభినయ ధీపారంగ తోరంగతః.

జయ జయ శ్రాంత విశ్రాణనరాధేయ
జయజయ సుప్రశస్తాభిధేయ
జయజయ లోకరక్షణ దక్షణోపాయ
జయజయ శౌర్య తేజస్సహాయ
జయజయ శృంగార సారాంగజప్రాయ
జయ జయ నిర్వ్యాజ సత్కృపాయ
జయజయ మహాప్రతాప యశస్సమాజ
జయ జయాశ్రిత లోకనిర్జర మహీజ
జయజయ యేకధారుణీతలేశ్వర తనూజ
జయజయౌదార భోసల శాహరాజ.

సూ. వ.: అవురా, యీ విధంబున మఱియు నే విధాన నంటేను.

నాంది ద్వి. శ్రీ జానకీనాథ శ్రితదైత్యయూథ
రాజీవదళనేత్ర రమణీయగాత్ర
ఘనవర్ణ సమనీల కరుణాలవాల
వననిధి గంభీర వైభవోదార

పాకశాసనమిత్ర భవ్యచారిత్ర
శ్రీకర గుణసాంద్ర శ్రీరామచంద్ర
నీకు నే మ్రొక్కెద నెమ్మదితోను
ఆ కాళిదాసాదులగు కవీశులకు
సారెకు నేను నంజలి నొప్పఁజేసి
శ్రీరామ పట్టాభిషేక నాటకము
గావించెదను మదిఁగదు భక్తిమీఱి
భూవలయాన నప్పాదు భక్తిమీఱ.

సూ. వ. : అవురా, యీ విధంబున నభీష్టదేవతావందనంబు గావించి, సభా నాయకాదుల నభినందించి, శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన శ్రీరామ పట్టాభిషేక మనెడు నాటకంబుఁ గథాక్రమముగా వినిపించెదము. విని నవధరింపరయ్యా.

కథాసంగ్రహము

ద్విపద

శ్రీరామచంద్రుఁ డాశ్రిత హితోదయుఁడు
వారిజ బంధుఁడు వంశవర్ధనుఁడు
మనులు రావణకుంభ కర్ణాదులైన
దనుజుల మర్దించి దయమీఱ నిపుడు
గరిమ మీఱంగ లంకాపురమునను
బరఁగ విభీషణు పట్టంబుఁ గట్టి.
జనకజ లక్ష్మణ సహితుఁడై వేగ
నను పొందగా నయోధ్యకు రాఁగనపుడు
మున హనుమంతుని ముదమునఁ బిల్చి
మనతతో భరతుని కడకుఁ బంపుటయు
నకలేకుఁ డగు రామచంద్రు సేమంబు
హనుమంతుఁడును దెల్పనట భరతుండు
నంతనెల్లుచునంత శత్రుఘ్నుఁగూడి
వింతగా రామభూవిభు నెదుర్కొనుట
ధరణీశ్వరుఁడు దన తమ్ముల మిగులఁ
గరుణతోడుతఁ జూచి కౌగిలించుటయు
నమజులతో రాముఁడయ్యయోధ్యకును
జనుదెంచుటయు నంత సజ్జనుల్వొగడ
వెలయుంగ రీతుల వేడ్కతోభాను
కులుఁడు శ్రీరాముండు గొలువుండుటయును
జెలువుమీఱినయట్టి శ్రీరామభద్రు
కొలువుకు నందఱు గోరి వచ్చుటయు
మునిచంద్రుఁడు వశిష్ఠముని వచ్చుటయును
నమపొంద దైవజ్ఞు లరుదెంచుటయును
దేవేంద్రుఁ డాదిగా దేవతలెల్ల

వేవేగ చనుదెంచి విజయలగ్నమునఁ
బట్టంబు శ్రీరామభద్రుని కపుడు
గట్టిగా మిగుల వైఖరిఁ గట్టుటయును
ననియెడి కతలచే నమరుచునుండు
పనువడి శ్రీరామపట్టాభిషేక
మనుపొంద శాహేంద్రుఁ డతిభక్తిమీఱ
మనతతో రచియించెఁ గవులు మెచ్చఁగను.

సూ. వ.: అవురా, యీ విధంబున భూరిగుణోదార వేషభాషాది భూషితంబై శ్రీ శాహమహారాజ ప్రణీతంబగు రామపట్టాభిషేకం బనెడు నాటకంబునందుఁ దొలుత వినాయక ప్రార్థన సేయఁగా నపుడు విఘ్నేశ్వరుండు వచ్చే మార్గం.

ద్విపద పాశాంకుశంబులు పరగహస్తముల
భానురకనక ప్రభల్వెలసిల్లఁ
బొనఁగ లంబోదరంబున నాగవితతి
యసమానకాంతితో నాడుచుండంగ
వలనొప్ప మూషిక వాహనంబెక్కి
వెలయ విఘ్నేశుండు వేడ్కతో వెడలె.

సూ. వ.: అవురా, యీ విధంబున నా విఘ్నేశ్వరుండు వచ్చే మార్గం పరాకు.

దరువు ముదమునఁ గుండలముల రుచు లమరఁగ
నిదె వెడలెను విఘ్నేశ్వరుఁ డిపుడు. ౧

కర్ణతాళములు గదలఁగ నల్లన
స్వర్ణనిభుఁడు గణపతి తగవచ్చెన్. ౨

మూషిక వాహనమున నొప్పుచు శుభ
వేషుడు వెడలెను విఘ్నేశ్వరుఁడు. 3

తన లంబోదరమున ఫణులాడఁగ
మనతను వెడలెను గజముఖుఁ డిపుడు. ౪

మోదముతో గణముఖ్యులు గొలువఁగ
మోదక హస్తుఁడు ముదమున వెడలెన్. ౫

సూ. వ.: అవురా, యీ విధంబున నా విఘ్నేశ్వరుండు వచ్చిన యీ తదనంతరంబునఁ గథానం విధానం బెవిధాననంటేను. ఆ భరతశత్రుఘ్నులు గొలువుకు వచ్చు నమయంబున వారి వాకిట కటికవాఁడు హెచ్చరిక దెలుపవచ్చే మార్గం.

దరువు పట్టె నామమును బెట్టి బరికోలఁ గేలఁ బట్టి
దట్టిపైని దుప్పటి గట్టిగాఁ గట్టి

జుట్టునిండ పూలు సుట్టి మిట్టపండ్ల నెగ బెట్టి
యట్టహాసముతో వికటాంగుఁడు వచ్చె.

సూ. వ. : ఎవరోయి, యెక్కడనుండి వచ్చితివోయి, చెప్పవోయి. నాయఁడా.

విక. వ. : ఆ, యేమంటా.

సూ. వ. : నీ వెవరు, ఎక్కడనుండి వచ్చుచున్నావు. మాకుఁ దెలియఁ జెప్పవోయి.

విక. వ. : ఆ, నేనా, నన్నా, నన్నే యడుగుతావా. మీ యయ్యాకొడ్కా. నన్ను, ఎవరంటా యడిగేవు.

సూ. వ. : అవునోయి, చెప్పవోయి.

విక. వ. : నేనా, మా భరతయ్య, శత్రుమ్నయ్య వుండారె, వారి నగరి వాకిటనుండే కటికవాడనురా, నేను.

సూ. వ. : అహా, భరత శత్రుఘ్నులవారి కటికవాఁడవా. మంచిది గంటివి నీ విక్కడకు వచ్చినపని యేది చెప్పవోయి.

విక. వ. : మరి మా భరతయ్యా, శత్రుమ్నయ్యా యీాడకుఁ గొలువునకు వచ్చుచున్నారు. ఆందుకు ముందర నన్నంపించి చదురు ముస్తీదుసేసి డెబ్బైరెండు వినియోగాలవారిని ముస్తీదుగా నుండమని చెప్పి రమ్మన్నారు గంటికాఁగా వచ్చినాను.

సూ. వ. : ఓయి నాయఁడా! డెబ్బైరెండు వినియోగా లనఁగా నేమేమోయి.

విక. వ. : నీళ్ళు కట్టేది, తోరణాలు చల్లేది, బియ్యాం గియ్యాం, పప్పా గిప్పా, నేయి గీయి, యిదంతా ముస్తీదుగాఁ జేసేందుకు వచ్చినానోయి.

సూ. వ. : ఓయి నాయఁడా! పప్పెవరికి గిప్పెవరికి, నెయ్యెవరికి, గియ్యెవరికి, యిదంతా యెవరికిఁ జెప్పవోయి.

విక. వ. : నేయి నాకు, గీయి మా భరతయ్యకు. పప్పా నాకు, గిప్పా మా భరతయ్యకు. బియ్యాం నాకు, గియ్యాం మా భరతయ్యకు. విడిది నాకు, గిడిది మా భరతయ్యకు. అంతా నాకు, గింతా మా భరతయ్యకు.

సూ. వ. : మంచిది గంటివి. డెబ్బది రెండు వినియోగాల వారలను ముస్తీదుగా నుంచుచున్నాము. మీ దొరను తోడ్కొనిరావోయి.

సూ. వ. : అవురా, యీవిధంబున నా కటికవాఁడు వచ్చి హెచ్చరిక దెల్పిన యా తదనంతరంబున నా భరత శత్రుఘ్ను లిరువురును దమ నిత్యకొలువునకు వచ్చే మార్గం బేవిధాన నంటేను.

చ. కర జలజంబునందు వరకార్ముకమున్ విలసిల్లఁగా జటల్
శిరమునఁ దేజరిల్ల శశిశేఖరు కైవడి నారచీరలన్
గరిమను గట్టి ముందుగ వికానముతోడ జనుల్ నుతింపఁగా
భరతుఁడు వచ్చెఁ గొల్వునకు బాగుగఁ దమ్ముఁడు సేరి కొల్వఁగన్

సూ. వ.: అవురా, యీవిధంబున నా భరతశత్రుఘ్నులు నిత్యకొల్వునకు వచ్చే మార్గం పరాకు.

దరువు కనకమయమయిన ధనువును
గరయుగమునను( బూని
తన శత్రుఘ్నునితోడ వెడలెను
ఘనుఁడు భరతుఁ డిపుడు.

విక. వ.: రాజాధిరాజ రాజపరమేశ్వర, రాజమార్తాండ రాజనక్షత్రచంద్రోదయ, పరాకు. ఇదిగోనయ్యాస్వామి కొలువుకూటము శృంగారింపఁబడినది కొలువునఁ గూర్చుండుడయ్యా స్వామి.

భర. వ.: రారా కటికవాఁడా! వాకిట నెవరున్నారు చూచిరారా.

విక. వ.: మాభాగ్యంసామి. ఎవ్రరా వాకిటకాడ.

హను. వ.: రావోయి కటికవాఁడా, హనుమంతుఁడు వచ్చినాఁడని, భరతేశునితోఁ బల్కరించవోయి.

విక. వ.: మస్తిగంటి. ఈడఁ గూకుండు, సామి! హనుమంతుఁడు వచ్చియున్నాఁడు.

భర. వ. తోడ్కొనిరారా.

విక. వ.: మాభాగ్యం, రావోయి, హనుమంతుఁడ, మాభరతుఁడు పిలుచుకొని రమ్మన్నాఁడు, రావోయి

హను. వ.: మహాభాగ్య మాయెనోయి. శరణు శరణయ్యా స్వామి.

భర. వ.: రావోయి హనుమంతుఁడ, యెక్కడనుండి వచ్చితివి తెలియఁ జెప్పవోయి.

హను. వ.: ఆతీరుననే తెలియఁజెప్పెదఁగాని వినవయ్యా స్వామి.

ద్విపద ఊరు కువలయచంద్ర! యురుకృపాసాంద్ర!
నీరధిగంభీర నిర్మలాకార
నరన సద్గుణహార శత్రుసంహార
భరతమహిపాల భానురశీల
వినవయ్య దెలిపెద విశదంబుగాను.
ననుపొందగా నేను వచ్చినరాక
వేవేగ శ్రీరామవిభుఁడని లోన
రావణు నమయించి లంకాపురమునఁ
బరగ విభీషణు పట్టంబుగట్టి
ధరణిజఁ గైకొని తమ్ముఁడు దాను
వరున సుగ్రీవాది వానరుల్ గొలువ

నరుదెంచుచున్నవాఁడా యయోధ్యకును
మునుకొని ననుఁబిల్చి ముదమున మీకుఁ
దన తెఱంగెల్లను దద్దయుఁ దెల్పు
మని పంప మీకడ కతివేగమునను
జనుదెంచితిని నేను సంతసంబునను.

భర. వ.: రావోయి హనుమంతుఁడ! నీ వాక్యంబులు విని చాల ధన్యుఁడ నైతిని.

దరువు
చాలధన్యుఁడనైతిని
శ్రీరామచంద్రుని సేమము వింటిని
మేలు హనుమంత రమ్మా
సొమ్ములను మిగుల నిచ్చెదను గొమ్మా
రావోయి హనుమంతుఁడ!
నీవాక్యంబులు విని చాలసంతోషమాయెను
ఇందవోయి బహుమానము దీసికొనవోయి.

హను. వ.: మహాభాగ్యమయ్యా స్వామి.

సూ. వ.: అవురా, యీవిధంబున నా హనుమంతుని వాక్యంబులు విని భరతుఁ డానందభరితుఁడై దమ్ముఁడైన శత్రుఘ్నునిఁ జూచి పలికే మార్గం.

భర. వ.: వింటివా శత్రుఘ్నా! యీవేళ శ్రీరామవిభుని సేమమెల్లను, సామి జంటగా జనకజాలక్ష్మణ సహితుఁడై సనుదెంచుచున్నాఁడట.

శత్రు.:

దరువు
ఎన్నిదినములాయె శ్రీరాముని~ గనుఁగొని యిపుడు సూడఁగల్గెను
అన్న! ధన్యులమైతిమి మాన్యులమైతిమి పుణ్యులమైతిమి మనము.

భర.:

దరువు
అందము మీఱఁగ వేగమె
యీ జనులందఱితోఁ గూడను
పొందుగ శ్రీరామచంద్రుని కెదురుగఁ
బోయి వత్తము మనము.

శత్రు.:

దరువు
బాగాయెనటువలెఁ బోదాము
శ్రీరామభద్రుని కెదురుగను
వేగమె యోయన్న భరతేశ
వేడుము వేడుక మీఱగను.

భర. వ. = వినవోయి శత్రుఘ్న! వసిష్ఠమహామునీశ్వరునిఁ బిలిపింపవోయి.

శత్రు. వ. = రారా కటికవాఁడా! మన వసిష్ఠమహామునీశ్వరుని పిల్చుకొని రారా.

వికె. వ. = మహాభాగ్యము సామి.

సూ. వ. = అవురా, యీవిధంబున నా వసిష్ఠమహామునీశ్వరుని బిలువు మనఁగా నా వసిష్ఠమహామునీశ్వరుఁడు వచ్చే మార్గంబు వరాకు.

దరువు
కరమున దండము మెఱయంగ
రుద్రాక్షసరములు మిక్కిలి సరసతఁదనర
గరిమను దన శిష్యగణములతోఁగూడ
నరుదెంచె వసిష్ఠవరముని యిపుడు.

వసి. వ. = ఎవరోయి కటికవాఁడు.

కటి. వ. = అదెంద్రా. మేము వచ్చినామని చెప్పిరారా.

వికె. వ. = మస్తిగంటి, యీడనుండు. సామి! మేము వస్తిమి.

భర.వ. = ఛీ నీవేల వచ్చితివి. వాకిట పదిలముగా నుండరా.

కటి.వ. = మహాభాగ్యముసామి. ఓ మీయయ్యాకొడ్క! అక్కడనుండు.

వసి.వ. = ఓరి వెట్టిముండాకొడక! యేమిసెప్పి వచ్చితివిరా.

కటి.వ. = నేను వచ్చినానని చెప్పివస్తిరా.

వసి.వ. = ఓరి నిర్భాగ్య, వసిష్ఠ మహామునీశ్వరుఁడు వచ్చినాఁడని చెప్పిరారా.

కటి.వ. = మాబాగు, సామి. ఏమో తెలియదు, వసిష్ఠమంట వచ్చివుండాడు.

భర.వ. = ఓరి, వసిష్ఠ మహామునీశ్వరుఁడా! తోడ్కొనిరారా.

కటి.వ. = మా భాగ్యము సామి. రావయ్యా వసిష్ఠ మహామునీశ్వరా! మిమ్ములఁ బిల్చుకొని రమ్మన్నారయ్యా.

వసి.వ. = మహాభాగ్యమాయెనోయి.

భర.శత్రు. వ. = శరణు శరణయ్యా! వసిష్ఠ మునిచంద్రా!

వసి.వ. = చింతితార్థ సిద్ధిరస్తు.

భర.వ. = కుర్చోవయ్యా స్వామి. నేడు సంతోషవార్త వింటిమి.

వసి.వ. = అదెటులనోయి. తెలియఁజెప్పవోయి.

భర.వ. = అయితే చెప్పెదఁగాని వినవయ్యా. మన రామభద్రస్వామి రావణ కుంభకర్ణాదులను సంహరించి లంకాపురంబున విభీషణ పట్టంబుగట్టి, సీతాలక్ష్మణ

సమేతుఁడై యయోధ్యా పురంబునకు వచ్చుచున్నాఁడట. అందుకుఁ దమ వృత్తాంతంబు మనకుఁ దెల్పుమని హనుమంతు నంపించినారయ్యా.

వసి.వ. : భళా భళా మహా లెస్సాయెను. మహా సంతోషమాయెను. నేఁడు మహాసుదినము. ఎన్నాళ్లాయెను స్వామి సేమము విని. నేఁడు వింటిమే. జన్మసాఫల్య మాయెను.

భర.వ. : వినవయ్యా! వసిష్ఠ మునిచంద్ర! స్వామి వచ్చుచున్నాఁడే, యెదురుగాఁ బోవలెఁ బోవుదము రావయ్యా.

వసి.వ. : వినవోయి భరతేశ! రామభద్రస్వామి యయోధ్యా పురంబునకు వచ్చుచున్నాఁడే తలవరులను బిలిపించి పట్టణము శృంగారింప మనవోయి.

భర.వ. : మహాభాగ్యమాయెనయ్యా. అదెవరురా కటికవాఁడా.

కటి.వ. : స్వామి.

భర.వ. : తలవర్లను బిలుచుకొనిరారా.

కటి.వ. : మా భాగ్యము.

సూ.వ. : అవురా, యివ్విధంబున, నా భరతేశుఁడు తలవర్లను బిలువుమనఁగా నవుడు తలవర్లు వచ్చే మార్గంబు పరాకు.

దరువు
అరిగలు కత్తులును విండ్లును
మెఱయుఁ దుపాకులు తుడుములును
కరములఁ బూనుకొని తలవరు
లరుదెంచిరి కడువింతగను.

తల.వ. : ఎవరోయి కటికవాఁడు తలవర్లు వచ్చినారని యేలినవారితోఁ బల్కరించి రావోయి.

కటి.వ. : మస్తిగంటి, యీాడనుండుడు. సామి! తలవర్లు వచ్చినారు.

భర.వ. : తోడ్కొనిరా.

కటి.వ. : మహాభాగ్యముసామి. రారోయి తలవరులారా. మిమ్ములను బిల్చుకొని రమ్మన్నారు.

తల.వ. : మా భాగ్యం. అదారా అడిశెవా మున్నెపాకట్టుం పొరకు నా మల్లా అర్దం పొరకెపోవేం. కుంబుదురోంశామి పరాకు.

భర.వ. : రారోయి తలవరులార రామభద్రస్వామి, యయోధ్యా పురంబునకు వచ్చుచున్నారు, పట్టణం శృంగారించి తోరణాలు గట్టి నీళ్ళుచల్లి యంతా ముస్తీదు సేయించరోయి.

తల.వ. : మహాభాగ్యము స్వామి.

సూ.వ.: అవురా, యీ విధంబున భరతవచన ప్రకారంబుగా నా తలవరులు పట్టణము శృంగారింపుమని చాటించే మార్గంబు పరాకు.

తల.:

దరువు
పూర్ణకుంభములు దేరోయి, భూసురులారా!
వర్ణన కెక్కిన రామావసుధేశుని కెదురుగ
వినరోయి భూసురులారా రామభద్రస్వామి
అయోధ్యాపురంబునకు వచ్చుచున్నారు
పూర్ణకుంభముల నెత్తుకొని యెదురుగ రండోయి.
ముత్యాల హారతులు వేరె ముత్తైదులారా!
నిత్యతోరణా లెత్తరోయి నీటుగా మానవులారా!
ముత్తైదులంతా గూడుకొని ముత్యాల హారతులు దెండో
నిత్య తోరణాలు కట్టండో
కదళీ కంబాలు నిలుపరోయి మన కాపులారా!
ముదమునఁ బన్నీరు చల్లరె మోహనాంగు లారా! మీరు
కాపులంతాగూడి కదళీకంబాలు నిల్పి
వీథులంతా చక్కఁ జేసి పన్నీరు చల్లండో
అంగళ్ళు శృంగారింపరోయి అతివర్తకులారా!
సంగీత మేళముతో రారె రంగుగా నో వేశ్యలారా!
సెట్టివర్తకులందఱు గూడుకొని
అంగళ్లు శృంగారించండో!
వేశ్యలందఱు సంగీతమేళముతో
స్వామికి నెదురుగా రండో!

తల.వ.: స్వామి! పట్టణమంతా శృంగారించితిమయ్యా స్వామి.

సూ.వ.: అవురా, యీ విధంబున నా తలవరులు పట్టణము శృంగారించిన యా తదనంతరంబున భరత శత్రుఘ్ను లిరువురును బాదచారులై వసిష్ఠ మహా మునీశ్వర సహితంబుగాను రామస్వామి కెదురుగా వచ్చే మార్గంబు పరాకు.

దరువు
ముదమున శత్రుఘ్నుఁడు
సాదరమునఁ గొలువగా
పాదుకలు శిరమున నుంచి
భరతుఁడు వెడలెను
వెడలెను సకల పరివారములు
సరసతను గొలువఁగ
అకళంకములతోను.
అన్నను్ఁ జొడఁగన వెడలె.

సూ.వ.: అవురా, యీ విధంబున నా భరత శత్రుఘ్నులు రామస్వామి కెదురుగా వచ్చు నవసరంబున నాపలి కథా సంవిధానంబె విధానమంటేను. రామ

భద్రస్వామి సీతాలక్ష్మణ సమేతుఁడై సకల వనచరులు గొల్వఁగా నయోధ్యాపురంబునకు వచ్చే మార్గంబే విధానమంటేను.

ద్విపద పున్నమచందురుఁబోలు మోమునను
వెన్నెలకైవడి విలసిల్లు నగవు
నీలమేఘము ఛాయ నిరసించుమేని
మేలైన కాంతులు మెఱుఁగు లీనఁగను
మెఱుపుచందంబున మేటి కార్ముకము
కలపంకజంబున గరిమతోఁ జెలఁగ
మీఱిన జడలును మేలైన నార
చీరలు ధరియించి శివుని కైవడిని
కరుణారసంబు వైఖరి మీఱఁగాను
ధరణిజయును సుమిత్రా తనూజుండు
నిరుగడలందును నింపొందిరాఁగ
వరుడైన భక్తితో నా విభీషణుఁడు
ముదమున మ్రొక్కుచు ముందర నడవ
మది చెలంగగ హనుమంతుండు గొల్వ
సకల వానరులెల్ల సన్నుతిసేయ
సకలేశుఁడగు రామచంద్రుండు వెడలె.

సూ. వ.: అవురా, యీ విధంబున నా రామభద్రస్వామి వచ్చే మార్గంబు పరాకు.

దరువు జనకజలక్ష్మణ సహితుఁడై
శ్రీరామజననాథుఁడు వెడలె
వనచరులు గొలువఁగ
వరుస జడలు నారవలువలు ధరియించి
పరమేశుఁడన రామభద్రుఁ డిపుడు వెడలె.

సూ. వ.: అవురా, యీ విధంబున రామభద్రస్వామి వచ్చిన యా తదనంతరంబున నా భరతేశుఁడు రామభద్రస్వామిని గనుంగొని పలికే మార్గం.

దరువు శరణు శ్రీరామచంద్రా! స్వామి
శరణు లక్ష్మణ దయాసాంద్ర
శరణు శరణు ఉపేంద్రా! స్వామి
శరణు రాజదేవేంద్రా!

భర. శత్రు. వ.: శరణు శరణయ్యా స్వామి.

రామ. వ.: రావోయి భరతేశ. శరణు శరణయ్యా వసిష్ఠ మునిచంద్ర.

దరువు మ్రొక్కెదవయ్యా వసిష్ఠమునిచంద్ర

వసి. వ.: నీకు నిక్కము మేలు గావలె నీకు శ్రీరామభద్రా!

వసి. వ.: రావోయి రామభద్రస్వామి. మిమ్ముఁ జూచి పెక్కునాళ్ళాయెను. ఇప్పుడు చూడఁగల్గితిని. చాల సంతోషమాయెను.

రామ. వ.: రారోయి భరత శత్రుఘ్నులారా, యిదిగో విభీషణుఁడు, సుగ్రీవుఁడు, సకలవనచరులు వచ్చినారు. చేటి తీసికొనుడోయి.

భర. శత్రు. వ: మహాభాగ్యమాయెను స్వామి.

సూ. వ.: అవురా, యివ్విధంబున రామభద్రస్వామి భరతశత్రుఘ్నులను కౌఁగిటఁజేర్చినవాఁడై వారలను జూచి పలికే మార్గం.

దరువు
సేమామె మీకిపుడు ఓ భరతేశ!
సేమామె మీ కిపుడు సేమామె మీ కిపుడు
సేమామే భరతేశ సేమమే కౌశల్యకు ఓ భరతేశ.
సేమమె బంధులకు సేమమె మిత్రులకు
సేమమె జనములకు ఓ భరతేశ.

భర. వ.: ... ... ...

ద్విపద
విమలాంబుదశ్యామ వినవయ్య రామ
కమలాప్తకులసోమ కమనీయ నామ
మీ పాదపద్మముల్ మేము గనుఁగొన
నేపున మా కోర్కెలెల్లసిద్ధించెఁ
బొందుగ మీదయ పొంది యీ జనులు
అందఱు సేమమై యమరి యున్నారు
తడయక శ్రీరామ తడవేల యింక
అదె యయోధ్యాపురి యర్చింతురమ్ము.

రామ. వ.: మహాభాగ్యమాయెను.

సూ. వ.: అవురా, యీ విధంబున రామస్వామి పలుకులు విని వసిష్ఠుఁడు రామస్వామినిఁ జూచి పలికే మార్గం.

ద్విపద
వినవయ్య శ్రీరామ విఖ్యాతనామ
మనువంశకుల దీప మనసిజరూప
బాగుగా పితృవాక్య పరిపాలనంబు
వేగమే గావించి విజయంబు పూని
రావణాదులనెల్ల రణమునఁ గూల్చి
దేవతలెల్ల నుతింపనీవేళ
చనుదెంచితివి చాల సంతోషమాయె
నిను గొనియాడంగ నేర్తునె నేను
మనతతోఁ బట్టంబుగట్టుకొను మిఁకను
జనుల బాలింపుము జననాదచంద్ర.

రామ. వ.: వినవయ్యా స్వామి! మీయొక్క యాశీర్వాదబల మింతేగాద. మంచిది, యా తీరుననే, యయోధ్యాపురికిఁ బోవుదము రావయ్యా.

సూ. వ.: అవురా, యివ్విధంబున నా రామభద్రస్వామి సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేతుఁడై సుగ్రీవాది వనచరులు గొలువఁగా, నా రామభద్ర స్వామి సకల సన్నాహముతోడనుగూడ సకల పరివారములు గొల్వఁగా నయోధ్యా పురంబునకు వచ్చే మార్గంబు. నేఁడు నాఁడై నాఁడు నేఁడై నవరసాలంకారమై విచిత్రార్థమై యుండవలెఁ బరాకు.

దరువు
మనత మీఱఁగ వచ్చెను శ్రీరాముఁడు
మనత మీఱఁగ వచ్చెను
మనత మీఱఁగ వచ్చెను జనులు పొగడగను
కనకమయమైన మేటి ధనువు చేఁబూని
జననాథుఁడైన శ్రీరామచంద్రుఁడు ముదముగను
జనకజాలక్ష్మణ భరతశత్రుఘ్న సమేతముగ
మనతమీఱఁగ వచ్చెను శ్రీరాముఁడు
మనత మీఱఁగ వచ్చెను.

కటిక. వ.: రాజాధిరాజ, రాజపరమేశ్వర, రాజమార్తాండ, రాజనక్షత్ర చంద్రోదయ, అనహాయ వీరశూర విక్రమార్కావతార, పరాకు. స్వామి! ఇదిగోనయ్యా, స్వామి! ఈ రమ్య ప్రవేశంబునఁ గూర్చుండరయ్యా.

రామ. వ.: రావోయి సుగ్రీవ! విభీషణ, అంగద, హనుమంత, కూర్చుండ రోయి.

సముదాయ వ.: మహాభాగ్యమాయెనయ్యా స్వామి. అ తీరుననే గూర్చుండెద మయ్యా.

సూ. వ.: అవురా, యీ విధంబున నా రామస్వామి కొలువునఁ గూర్చున్న తదనంతరంబున నావలి కథానంవిధానంబేవిధాననంటేను వన్యమృగాలు కానుక గొంచు గుహుఁడు వచ్చే మార్గం.

దరువు
వన్యమృగములు గొంటా
గుహుండిపుడు వచ్చె శ్రీరాము కొలువుకు
కానుకగొంచు వచ్చె శ్రీరాము కొలువుకు. ౧

గుహు. వ.: ఎవరోయి వాకిటఁ గటికవారలు.

కటి. వ.: ఎవరోయి నీవు, అతల నుండవోయి.

గుహు. వ.: రావోయి కటికవాడ! గుహుండు వచ్చినాఁడని రామస్వామితోఁ జెప్పి రావోయి.

కటి. వ.: మస్తె, యీాడనుండు చెప్పి వస్తా. సామి! రామన్న! గుహలు యీాడకు వచ్చింది.

రామ. వ.: ఇక్కడ గుహలులేవు, కొండలులేవు, పోర.

కటి. వ.: ఐతేస్వభావమే, యీడగుహలు లేవంటా, యీడను వస్తిమే. ఈడ గుహలేడనున్నవి.

రామ. వ.: పోర వాకిటకాడ ఐతనంగా నుండరా.

కటి. వ.: మాబాగు సామి!

ఛీ పోర, అతల మాదొర చాలకోపముసేసిరి. ఈడ గుహలులేవు కొండలు లేవు, నీవు దబ్బరచెప్పుచున్నావని నన్నుఁ దిట్టిరి.

గుహు. వ.: కాదుర, మీభక్తుండైన గుహుండు వచ్చినాఁడని చెప్పిరారా.

కటి. వ.: మాబాగు. సామి గుహుండు వచ్చినాఁడు.

రామ. వ.: పిలుచుకొనిరారా.

కటి. వ.: మాబాగు సామి.

రావోయి గుహుండా! రామన్న పిలుచుకొని రమ్మనె.

గుహు. వ.: మహాభాగ్యమాయెను. పోదాము రావోయి.

గుహు. వ.: శరణు శరణయ్యా స్వామి.

రామ. వ.: రావోయి గుహుఁడా! బహునాళ్లాయెను జూచి లెస్స యున్నావా.

గుహు. వ. స్వామివారి పాదాలుచూచి ధన్యుఁడనైతిని.

సూ. వ.: అవురా, యీవిధంబున గుహుండు వచ్చినతరువాత రామస్వామి కొలువుకు మంత్రివచ్చే మార్గం.

దరువు
చతురుపాయములందుఁ జతురుండతివినయ
యుతుండు, సకలజనహితుండు వేడుకను
మంత్రియైన సుమంత్రి వెడలెను
అతులితుండైన రఘుపతికొలువుకిపుడు. ౧

మంత్రి వ.: ఎవరోయి కటికవాఁడు, నేవచ్చినానని చెప్పవోయి.

కటి. వ.: మంచిది ఈడనుండు.

సామి! నే వచ్చినాను.

రామ. వ.: నీవేలవచ్చితివి. వాకిట పదిలంగా నుండరా.

కటి. వ.: మాబాగు.

ఓసి వాకిటకాడ నందడి యాకడ తీయరా.

మంత్రి వ.: ఏమిచెప్పితివిర.

కటి. వ.: నేవచ్చినానని చెప్పితిని.

ఛీ యేలవస్తివి పొమ్మనెను.

మంత్రి వ.: అట్లాకాదుర. మంత్రి వచ్చినాఁడని చెప్పరా.

కటి. వ.: మాబాగు. చెప్పవస్తా తాళు.

సామి! మంత్రం వచ్చింది.

రామ. వ.: ఓరి లెన్స పరామర్శించుకొని రారా.

కటి. వ.: మస్తి, సామి.

రావోయి. నీ పేరింకోమాటు సెప్పరాదా.

మంత్రి వ.: ఓరి వెఱ్ఱిముండాకొడక; మంత్రి వచ్చినాడని చెప్పరారా.

కటి. వ.: సామి! మంత్రి వచ్చినాఁడు.

రామ. వ.: పిలుచుకొని రారా.

కటి. వ.: మాబాగు సామి.

రావోయి మంత్రి! పిలుస్తున్నారు.

మంత్రి వ.: శరణు శరణయ్యా, స్వామి.

రామ. వ.: కూర్చుండవోయి, సుమంత్రుఁడ!

సూ. వ.: అవురా, యీవిధంబున, నా వసిష్ఠ మహామునీశ్వరుండు భరతునిఁ జూచి పలికే మార్గం.

వసి. వ.: వినవోయి భరతేశ! రామస్వామికి పట్టాభిషేకము సేయవలె నందుకు ముత్యాలు, రత్నాలు, గోమేధికపుష్యరాగములు, నవధాన్యాలు, ఉత్తమ మైన నదుల తీర్థాలు, సకలము దెప్పింపవోయి.

భర. వ.: వినవోయి మంత్రి పట్టాభిషేక ద్రవ్యాలు దెప్పింపవోయి.

మంత్రి వ.: స్వామి, యంతా వచ్చియున్నది.

వసి. వ.: వినవోయి భరతేశ! సకలమైన ద్రవ్యాలు వచ్చెనే, పట్టాభిషేక ముహూర్తము నిశ్చయించవలెను. పురోహితునిఁ బిలిపించవోయి.

భర వ.: మహాభాగ్య మాతీరువనే పిలిపించెదము. రారా, కటికవాఁడ. పురోహితునిఁ బిలుచుకొని రారా.

కటి. వ.: మాబాగు సామి.

సూ. వ.: అవురా, యీవిధంబున నా పురోహితునిఁ బిలువుమనఁగా నపుడు పురోహితుండు వచ్చేమార్గం.

దరువు పంచాగమును జేతఁబట్టి పట్టివస్త్రమునుబెట్టి
ఎంచంగ దైవజ్ఞు లేతెంచిరియిపుడు.

పురో. వ.: ఎవరోయి కటికవాఁలు వాకిట.

కటి. వ.: మీరెవరోయి.

బ్రాహ్మ. వ.: మేము, పురోహితుండు వచ్చినాఁడని చెప్పిరా.

కటి. వ.: మస్తిగంటి. ఈడనుండు చెప్పివస్తా.

సామి! పురోహితుఁడు వచ్చినాఁడు.

రామ. వ.: ఓరి, తోడ్కొనిరారా.

కటి. వ.: మా బాగు సామి.

ఓయి, బాపనవాఁడా రారా.

పురో. వ.: మంగళాని భవంతు.

రామ. వ.: నమోనమః కూర్చుండవయ్యా.

పురో. వ.: నమస్కారమయ్యా వసిష్ఠమునిచంద్రా!

వసి. వ.: అనంతనమస్కారం. కూర్చుండవయ్యా, కొండుభట్లు. రావయ్యా కొండుభట్లు. రామస్వామికి పట్టాభిషేకము సేయవలె, లగ్నము నిర్ణయము సేయవయ్యా.

కొండు. వ.: భళాభళా మహాలెస్సాయెను. ఇదే సుముహూర్తము. ఇదే సులగ్నము. నేఁడు, డా, మహాయుత్తమముగా నున్నది. పట్టాభిషేకము సేయింపరయ్యా.

సూ. వ.: అవురా, యీవిధంబున నా రామస్వామి పట్టాభిషేకంబు నందు దేవేంద్రాది దేవతలు వచ్చునవసరంబునఁ దొలుత శ్రీపరమేశ్వరుండు వచ్చేమార్గంబె విధాన నంటేను.

ద్విపద శిరమున బాలశశిప్రభాభురము
కరమునఁజాప ఢక్కాత్రిశూలములు
గళమున రుద్రాక్ష కంఠమాలికలు
జడలలోపల గాంగఝర నర్తనములు
కటియందు విలసిల్లుఁ గరటిచర్మంబు
పటిమతోఁజెలఁగ వైభవములతోడ
నమరుచు వృషవాహనారూఢుఁడగుచు
నమరవందితుఁడు శ్రీహరుఁడు దావెడలె.

దరువు దేవుఁడు వెడలె నీ శ్రీమహాదేవుఁడు వెడలె.
దేవుఁడు శ్రీశంకరుండు ఠీవిమీఱఁగనిపుడు
శ్రీ వృషభవాహనముపై వేడుకతోనెక్కి
గంగజడలలో దరంగములు మీఱగ
నంగజహరుఁడు దివ్యమంగళాకారుఁడు దేవ
బాలచంద్రచంద్రికలు ఫాలమున విలసిల్ల
లాలితరుద్రాక్ష కంఠమాలికలతో వామ
నాగచర్మోత్తరీయము నాగభూషణములలర
నాగమదమర్దనుఁడు నాగశోభిల్లుచు రుద్ర
శూలడమరుశాపములు కేలనుధరించి, భక్త
పాలుఁడైన శాహభూమిపాలదైవమైన ఆదిదేవుడు వెడలె.

సూ. వ.: అవురా, యివ్విధంబున శ్రీపరమేశ్వరుండు వచ్చిన యాతదనంతరంబున రామభద్రస్వామి పట్టాభిషేకంబునకు దేవేంద్రుండు వచ్చేమార్గంబెవిధాన నంటేను.

చం. కరముననొప్పు వజ్రమును గన్నులువేయి నాల్గుదిక్కులన్
నెరయఁగఁజూచుచున్దిశల నిర్మల రత్నకిరీట దీధితు
ల్మెఱయఁగ భూరివైభవముమీఱఁగ మత్తమతంగజంబుపై
సురనికరంబుగొల్వ బలసూదనుఁ డింద్రుఁడు వచ్చెనత్తఱిన్.

వ. అన్నాఁడుగనుక, అవురా యీవిధంబున నా దేవేంద్రుఁడు వచ్చే మార్గం పరాకు.

దరువు ఐరావతముపై నెక్కి హస్తముతో రంభాదుల
చారుశృంగార నాట్యములుమీద దేవేంద్రుఁడు వచ్చె
దివిజులు దన చెంగటను జయ జే యనుచుఁ గొలువగ
రాజసము మీఱ సురరాజు వేడ్కతోను వచ్చె.

సూ. వ.: అవురా, యీ విధంబున నా దేవేంద్రుఁడు వచ్చిన తదనంతరంబున రామభద్రస్వామి పట్టాభిషేకంబునకు బ్రహ్మదేవుఁడు వచ్చే మార్గం బెవిధానమంటేను.

ఉ. నాలుగు నెమ్మొగంబులను నాలుగు వేదములన్ బఠించుచున్
మేలగు దేవతుల్ భుజముమీ ద నమర్చిన యుత్తరీయమున్
లాలితపట్టె వర్ధనములన్ విలసిల్లు శుభాక్షతంబులన్
ఫాలము లుల్లసిల్లగను బ్రహ్మముదంబునవచ్చె నత్తఱిన్.

వ. అన్నాడుగనుక, అవురా యీ విధంబున నా బ్రహ్మదేవుఁడు వచ్చే మార్గంబు పరాకు.

దరువు నాలుగు మోములను నాలుగు వేదములు
లీలఁ జదువుచు వచ్చె శ్రీ బ్రహ్మదేవుఁడిపుడు.

సూ. వ.: అవురా, యివ్విధంబున దేవేంద్రాది దేవతలు వచ్చిన యాతదనంతరంబున రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు జటావల్కములు విడిపించి కిరీట కేయూర కటక హారావళులు చీనీ చీనాంబరములు గట్టనిచ్చి పట్టాభిషేకంబునకు సకల సన్నాహంబుతోడను, శ్రీరామభద్రస్వామి సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేతుఁడై సకల వనచరులు గొల్వఁగా దేవేంద్రాది దేవతలతోగూడ, పట్టాభిషేకంబునకు బయలుదేరి వచ్చే మార్గంబు పరాకు.

దరువు
మణిమయములైన భూషణముల దనరఁగ
మన కిరీటము శిరమునఁ దనరగను
మనుఁడు పట్టాభిషేకమున కతిలీలను
చనుదెంచి శ్రీరామభద్రుండు వెడలె
వనచరులు చేరి కైవారములు సేయఁగ
వినయమున దేవతలు వేడ్క నుతియింప
అనుజులు గొలువఁగ నతివైభవములను
జనకజతో శ్రీరామచంద్రుడు వెడలె.

సూ. వ.: అవురా, యీవిధంబున నా దేవేంద్రాది దేవతలు రామస్వామినిఁ గనక సభయందు నవరత్న ఖచిత సింహాసనంబునఁ గూర్చుండ నేమించి సకలమైన తీర్థములచేతఁ బట్టాభిషేకము సేయు సమయంబున నారద కిన్నర కింపురుషులు మంగళంబు పాడే మార్గంబు పరాకు.

మా రామభద్రునికి మంగళం
మా సీతాదేవికి మంగళం
వనజాతనేత్రునికి వరకీరవాణికి
మనసిజ రూపునికి మంగళం
విహగ వాహనునికి విరిఁబోణికి, శ్రీశాహ
మహీపాలుని దేవునికి మంగళం.

ద్విపద
శ్రీ వెలయంగ నాశ్రిత రక్షకుండు
భావజాకారుండు పరమ పుణ్యుండు
భోసలకులసింధు పూర్ణచంద్రుండు
శ్రీ శాహ భూపాల శేఖరుండిపుడు
శ్రీరామ పట్టాభిషేక నాటకముఁ
గోరి గావించె నెక్కుడు భక్తి మీఱ
నెవ్వరు సదివిన నెవ్వరు విన్న
నెవ్వరాడిన మఱి యెవ్వరు సదువ
ధనధాన్య చయములు దరుచైన సతులు
మనమైన సంపదల్గరి రథాశ్వముల
నరుదైన భక్తిసౌనతి శోభనములు
గరుడవాహనుఁడిచ్చు గరిమ మీఱఁగను
దరణిలో నాచంద్రతారార్కముగను.

సంపూర్ణము

# రుక్మిణీ సత్యభామా సంవాదము

రచయిత : శాహజి

# రుక్మిణీ సత్యభామా సంవాదము

ద్విపద చెలువొంద రుక్మిణీ శ్రీ సత్యభామ
తొలుత వచ్చుటయు ముద్దుల కృష్ణుఁడంతఁ
జనుదెంచి రుక్మిణీ సాదరంబు గను
ననయంబు సరసంబు లాడుచుండుటయుఁ
జక్కని కృష్ణుని సత్యభామపుడు
పెక్కువ చెలిచేతఁ బిలువనంపుటయుఁ
జెలువుని విధమెల్లఁ జెలి తెల్పఁ దెలిసి
కలఁగుచు రుక్మిణీ కాంతారమునను
బొదరింటి కరుదెంచి పొంచియుండుటయు
నది యెఱుంగక కృష్ణుఁడల సత్యఁ గూడి
వగలు సేయఁగ నందు వచ్చియుండుటయు
జగడము రుక్మిణీ సత్యభామలకు
నరయంగ నౌటయు నలుక దీరుటయు
నరస రుక్మిణీ సత్యసంవాదమిపుడు
నవవైఖరుల మీఱ నాటకంబుగను
వివిధ శుభోక్తుల వినిపించు శాహ
రాజదేవేంద్రుండు రాజసంబునను
తేజంబు నొంది మేదినియందుఁ జెలఁగ.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ దొలుత గథాసంవిధానము వినిపించిన యనంతరంబున శ్రీ శాహ మహారాజ ప్రణీతంబైన రుక్మిణీ సత్యభామా సంవాదంబనెడు నాటకంబునందుఁ దొలుత నిర్విఘ్నంబుగాను విఘ్నేశ్వర ప్రార్థన సేయఁగా విఘ్నేశ్వరుండు వచ్చెడు మార్గం.

ద్విపద పాశాంకుశంబులు పరఁగ హస్తముల
భాసుర కనక ప్రభల్వెలసిల్లఁ
బొసఁగ లంబోదరంబున నాగవితతి
యసమాన కాంతితో నాడుచుండంగ
వలనొప్ప మూషిక వాహనంబెక్కి
వెలయ విఘ్నేశుండు వేడ్కతో వెడలె.

వ.: అన్నాఁడు గనుక.

సూ. వ.: అవురా, యీ విధంబున విఘ్నేశ్వర ప్రార్థన చేయఁగా విఘ్నేశ్వరుండు వచ్చెడు మార్గం పరాకు.

దరువు ముదమునఁ గుండలముల రుచులమరఁగ
నిదె వెడలెను విఘ్నేశ్వరుఁ డిపుడు
కర్ణతాళములు గదలఁగ నల్లన
స్వర్ణ నిభుఁడు గణపతి తగవచ్చెన్
మూషిక వాహనమున నొప్పుచు శుభ
వేషుఁడు వెడలెను విఘ్నేశ్వరుఁడు
తన లంబోదరమున ఫణులాడఁగ
మనతను వెడలెను గజముఖుఁ డిపుడు
మోదముతో గణముఖ్యులు గొలువగ
మోదకహస్తుఁడు ముదమున వెడలెన్.

సూ. వ. : అవురా, యీ విధంబునఁ దొలుత విఘ్నేశ్వరుండు వచ్చిన యనంతరంబున శ్రీకృష్ణస్వామి రుక్మిణీదేవిని శృంగార వనంబునందు సంకేత స్థలంబునకు రుక్మిణీదేవిని నంపింపఁగాఁ జెలికత్తెను గూడి రుక్మిణీదేవి వచ్చెడు మార్గం.

ద్విపద బంగారు చెంగావి పావడగట్టి
శృంగారములను రాజిలు చీర మెఱయఁ
బద్మ బాంధవురీతిఁ బలుదిశల్ వెలుఁగు
పద్మరాగపుఁ దీగె పరఁగ ధరించి
మంజుల నవరత్న మయమైన యట్టి
పంజుల కమ్మలింపలర దీనులను
వన్నె మీఱిన తన వాలుగన్నులను
దిన్నఁగాఁ గాటుక దీర్చి నెన్నుదుటఁ
దెలిపొందఁ గస్తూరి తిలకంబు దిద్ది
వెలయఁ గీల్జడనిండ విరిసరుల్వాల్చి
కంకణ యుగములు గరిమతోఁ బాణి
పంకజంబులఁబూని భామలు కొలువ
భావజునకుఁ దపః ఫలమైన మంత్ర
దేవత రుక్మిణీదేవి తావెడలె

సూ. వ. : అవురా, యీ విధంబున రుక్మిణీదేవి వచ్చెడు మార్గం పరాకు.

దరువు వలపు నిలుపలేనుర
ఇందుముఖులు గొల్వఁగాఁ బాదములందు
అందెలు ఘల్లని మ్రోయంగ
మందహాసము మీఱంగా రుక్మిణి వచ్చె
మందయానముతోఁ బొందుగ. ౧

వలరాజు శరమనంగ
అలరతిచేత విలసిల్లు చిలుక యనంగఁ
దొలుకరి మెఱుపనంగ రుక్మిణి వచ్చె
బలుచని చెక్కిళ్లు మెఱయఁగ. ౨

దరువు ఒయ్యారమున వెడలె నందము మీఱ ఒయ్యార.
ఒయ్యారమున వెడలెఁ దియ్యావిల్తు శరమునఁ
దొయ్యాలు లందఱుఁ గొల్వ నెయ్యాన రుక్మిణీదేవి ఒయ్యార.
నన్నని పయ్యెదలోన చిన్ని చన్నులు చెలంగ
పున్నమ చందురు నరిబోలు మోము వెలుగంగ. ౧

రాజిల్లు రూపున వలరాజు మోహముఁ జెందఁగా
రాజహంస నడలను రాజబింబానన వెడలెను. ౨

సూః వ.: అవురా, యీ విధంబున రుక్మిణీదేవి వచ్చి శృంగార వనమందు రమ్యప్రదేశమైన పొదరింటనుండు సమయంబున నావలి కథా సంవిధానం బే విధాన నంటేను. శ్రీ కృష్ణస్వామి రుక్మిణీ సత్యాభామలు శృంగార వనంబునకు వచ్చిరో లేదో యని చూచి రమ్మని యంపింపఁగా గోపాలకులు వచ్చెదు మార్గం.

దరువు గిరునామము దిద్ది భూషణము లలరఁ
గిలకిల నవ్వుచును
మీఱి కృష్ణుండనుప రుక్మిణిని వెదుక
మెఱయవచ్చె గోపాలుండు.

సూ. వ.: ఓరి మీరు ఎవ్వరా.

గోపా.: మేము గోపాలకులము.

సూ. వ.: ఇక్కడికేల వచ్చితిరి?

గోపా. వ: కృష్ణస్వామి, రుక్మిణీ సత్యభామలు శృంగార వనంబునకు వచ్చిరో లేదో చూచి రమ్మనఁగా వచ్చితిమి.

సూ. వ.: చూచితిరా?

గోపా. వ.: రుక్మిణీదేవి మాత్రం వచ్చియున్నది. సత్యాభామను గానము.

సూ. వ.: అట్లా కృష్ణస్వామితోఁ జెప్పు. పో.

సూ. వ.: అవురా, యీ విధంబున గోపాలకుండు పోయి కృష్ణస్వామితో రుక్మిణీదేవి మాత్రము వచ్చియున్నదని పలుకఁగా, ఆ వాక్యములు విని సత్యాభామను శృంగారవనంబున కంపింపఁగాఁ జెలికత్తెతోఁగూడ సత్యాభామ వచ్చు మార్గం.

సీ. కులుకు గుబ్బలమీఁదఁ జిలుఁగుఁ బయ్యెద జాఱఁ
బలుకులు చిలుక పల్కులను మీఱ
నొప్పైన తన వాలు కొప్పున మందార
సుమముల సరములు సొంపుమీఱ
బొలుపొంద బంగారు భూషణంబులు మేనఁ
దొలుకరి మెఱుపుల వలెను దనర
శ్రీలను గేరెడి చెలువైన పీనులఁ

... ... ...

తే. గీ. జనులపై వచ్చు మారుని శరమనంగ
నెమ్మి విహరించు బంగారు బొమ్మయనఁగఁ
జంద్రరేఖన సంగీతశాల కిపుడు
నిత్య యౌవనవతియగు సత్య వెడలె.

దరువు బాగైన గబ్బి గుబ్బల పయ్యెద జాఱ
సొగైన కన్నులు మిలమిల సొబగువార
నాగరికమైన నడలు నయము మీఱ
వేగ సత్యభామ వచ్చె వింత మీఱ. ౧

అందెలు ఘల్లుఘల్లని యతిశయిల్లఁగ
నిందుముఖులు ముదమంది కొలువంగ
నందము నెమ్మేనఁ జెలువొందుచుండఁగఁ
బొందుగఁ గస్తూరి బొట్టు పొలుపుమీఱఁగ. ౨

గరిమమీఱంగ వెడలెను శ్రీసత్యభామ
గరిమను వెడలెను మరుశరమనఁగఁ
గఱకుజడను విరిసరములు మెఱయ. 3
నందెలు ఘల్లని మ్రోయఁ బాదములయందు
నందముగను జనులంచఱు జూడఁగ
నిందువదన తెలివొందెడి నడల. ४

సూ. వ.: అవురా, యీవిధంబునఁ దొలుత రుక్మిణీసత్యభామలను శృంగార వనంబునందు వచ్చియుండు సమయంబునఁ జెలికానితోఁగూడ శృంగారవనంబునకు కృష్ణస్వామి క్రీడసేయవచ్చు మార్గం

ద్విపద నీలాంబుదచ్ఛాయ నిరసించు మేన
మేలైన సొమ్ములు మెఱుపులరీతిఁ
బరఁగంగఁ గాంచనాంబరము ధరించి
కరముల రత్నకంకణములు చెలఁగ
నీటుమీఱినయట్టి నెన్నుదుటందు
దీటులేక చెలంగు తిలకంబు వెలుఁగ
వేణుగానములను విని మెయి మఱచి
మానినీమణులెల్ల మరులుకొనంగ
దేవదేవుఁడు కృష్ణదేవుండు నిపుడు
వేవేగ లీలగ వెడలె వింతగను.

దరువు వింతగ పత్నాలకొండచెంత నెమలిపింఛము
ఎంతయుఁ దేజరిల్లగ నంతనమున
పంతముమీఱ గోపాలబాలకులు కొలువంగ
ఝుంతరికిటఝిమికిటశకథళాంగు
ఝెణుఝెణుధణతకయనియాడుచు. ౧

వచ్చి చూడఁడే గోపాలుండు
కనకమయమయిన భూషణములు దనరఁగ
దినకరకోటితేజుండు దేవదేవుండు
వనజలోచనుండు యశోదతనయుఁడైన శ్రీకృష్ణుండు
ధణధణధిమిధిమిఝెనుఝెనుధణతక
ధళాంగుధిమికిట యని యాడుచు. 2

ముందుగఁ బాదమునందును రత్నాలయందెలు గజ్జెలును
బొందుగ మ్రోయ గోవిందుడు వింత
ధింధిమిధిమిధిమి యనుచు నాడెని చూడరే
గోవిందుఁడు, ఆడెని చూడరె. 3

నందనందనుండు గోవిందుడు మోమున
మందహాసము మీఱంగ
బొందుగ మొలనున్న మువ్వలు మ్రోయంగ
దంఘణంధణంఘణ యనుచు నాడెని చూడరె. 4

సూ. వ.: అవురా, యీ విధంబున శ్రీకృష్ణదేవుండు వచ్చి గోపాలకునిఁ జూచి పలికెడు మార్గం.

కృష్ణ. వ.: ఎవరా గోపాలక రుక్మిణియు, సత్యభామయును నెక్కడనున్నారు చూపర.

గోపా. వ.: వినవయ్యా కృష్ణస్వామి. తాను ముందఱ వచ్చినప్పుడగుచో రుక్మిణీదేవిమాత్రం వచ్చియుండెను. సత్యభామను గానము. కాఁగా రుక్మిణీదేవి యుండెడు పొదరిల్లు చూపెద రావయ్యా.

కృష్ణ. వ.: ఏది చూపరా.

గోపా. వ.: ఇదిగో చూడవయ్యా.

కృష్ణ. వ.: వినరా, ఓరి గోపాలక! రుక్మిణీదేవి యుండెడి పొదరింటికి నేను బోవుచున్నాను. ఆ వనమందు సత్యభామ వచ్చిందో లేదో చూచిరా పోరా.

సూ. వ.: అవురా, యీ విధంబున రుక్మిణి యుండెడు పొదరింటికి శ్రీకృష్ణస్వామి రాఁగా, రుక్మిణీదేవి యెదుర్కొని పలికెడు మార్గం.

దరువు రావయ్యా రావయ్యా కృష్ణ! రతికేళినుందాము
ఈవేళ నేను నీరాక కెదురెదురె చూచుచుంటి.
నేటికి నిచ్చటికిని మాటతప్పక వచ్చితివి
బోఁటులలో మేలైతిని.

సూ. వ.: అవురా, యీవిధంబున నాదరముగాఁ బలికిన రుక్మిణిని జూచి కృష్ణస్వామి, ప్రత్యుత్తరముగాఁ బలికెడు మార్గం.

దరువు సంతోషమాయెను నిను(జూచి రుక్మిణి
కంతు తాపమింకను దీర్పవే.

రుక్మి. : కంతు తాపముదీఱ( గౌగిలిచ్చెద( గాని
యింత తామసమేల చెంతరావయ్యా.

కృష్ణ. : చెంత వచ్చెద( గాని యింతిరో నెనరున
వింతగా మోవాన నీయవె.

రుక్మి. : వింతగా మోవాన నిచ్చెద నను వేగ
కల(తజేయక యేలవయ్యా శ్రీకృష్ణ.

సూ. వ. : అవ్వరా, యీవిధంబున రుక్మిణి యుండెను పొదరింటిలో( గృష్ణుండు ముచ్చటలాడు సమయంబున నావలి కథాసంవిధానం బెవిధాననగా... సత్యభామ శ్రీకృష్ణుం డిక్కడకు రాకపోయెనని వద్దనున్న చెలికత్తెను జూచి పలికెడు మార్గం.

ద్విపద చెలియరో వినుమమ్మ శ్రీకృష్ణు( డిపుడు
వలపున శృంగారవనమున( గ్రీడ
సేయవచ్చెదనంచు( జెలువుగా నన్ను
నీయెడ( బొమ్మని యింక రా(డాయె.
నే రమణీమణి యింట నున్నా(డొ
మీఱి యాతని మాట మేలని నమ్మి
కల(గుచు నిందుండ(గా రణంజేసి
పొలుపొంద నింటికి( బోవాము రావె.

క. విను సత్యభామ వడకకు
మన కృష్ణుండేల వచ్చు మనమలరగ రా
కను నుండెనేని నన్నటు
పనుపమని చెప్పెదను వాని( బద్మదళాక్షి.

చెలి. వ. : విను సత్యభామ యేల పదరెదవు. ఇక్కడ క్షణముసేపుండుము. నేను బోయి కృష్ణుని( దోడితెచ్చెదనమ్మ.

సత్య. వ. : మహాభాగ్యమాయెనే ఆట్లానే పిలుచుకొనిరావే.

సూ. వ. : అవ్వరా, యీవిధంబున సత్యభామచేత( జెలికత్తె యనిపించుకొని కృష్ణుని వెదుకవచ్చెడు మార్గం.

దరువు వెలయ సత్యభామ వేడ్కతో నంప(గా
చెలికత్తె వచ్చెను శ్రీకృష్ణ కడకు
అందము మీఱంగ.

సూ. వ.: అవురా, యావిధంబున సత్యభామ చెలికత్తె కృష్ణుని వెదుకఁగ, తొలుతఁ గృష్ణుండు సత్యభామను రమ్మని యంపింపఁగ వచ్చిన గోపాలకుండును సత్యభామ చెలికత్తెయు నిద్దఱును నెదురొక్కన్నవారలై చెలికత్తెను జూచి గోపాలకుండు పలికెడు మార్గం.

ఉత్తర ప్రత్యుత్తరం

దరువు

చెలియరో నీవు ఇచ్చటికి వచ్చిన పని
వెలయు నాతోఁ జెప్పవే
తెలిపెద నీవు నిచ్చటికి వచ్చినరీతిఁ
దొలుత నాతోఁ దెలుపరా
వేడుకఁ గృష్ణుఁడు రుక్మిణిఁగూడి సత్యా...
వెతకి రమ్మన వచ్చితి
ఆడఁబోయిన తీర్థమాయె సత్యా
నన్నతనిని దెమ్మన వచ్చితి

గోపా. వ.: వినవే చెలికత్తె దైవయోగంబువలన నీవు తలంచిన కార్యంబు సఫలమాయెను. నేనుతలంచిన కార్యమును సఫలమాయెను. రుక్మిణితోఁ గృష్ణుండు ముచ్చటలాడుచున్నాడు. నీవు నేకాంతము చెప్పినప్పటికిని రుక్మిణికి సందేహము పుట్టును.

చెలి. వ.: అందులకు నేనొక యుపాయము జెప్పెదను గాని వినవేయి.

ద్విపద

చెలికాఁడ విను నీవు శ్రీకృష్ణుఁజేరి
మలయుచు.........మరుగాఁగఁజేసి
నెమ్మిగాను యశోద నిన్ను నేమిటికో
రమ్మనెనని బొంకి రయమున నతనిఁ
దెమ్ము రుక్మిణికి సందేహంబు లేదు
నమ్మతిఁజేసి నే సత్యఁ గూర్చెదను.

గోపా. వ.: మహాభాగ్యమాయెను.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ జెలికత్తె వాక్యంబులు విని గోపాలకుండు కృష్ణునితోఁ బలికే మార్గం.

గోపా. వ.: వినవయ్యా కృష్ణస్వామి యశోదాదేవి యేమో రహస్యముగా మాట్లాడవలెనని పిలుచుకురమ్మని నన్ను.........రావయ్యా.

కృ. వ.: మహాభాగ్యమాయెను. పోదాముదా.

రుక్మి. వ.: మనమిద్దఱము గూడియుండగా నిప్పుడెందులకుఁ బోయెదవోయి కృష్ణా!

కృ. వ.: పెద్దలు పిలువగాఁ బోకయుండరాదు. శీఘ్రముగాఁ బోయి వస్తూన్నాను.

రుక్మి. వ.: అయితే శీఘ్రముగా రావోయి.

గోపా. వ.: వినవయ్యా కృష్ణస్వామి, సత్యాభామ చెలికత్తె తాను నిన్నుఁ బిలువవస్తే రుక్మిణిదేవికి సందేహము పుట్టునని నేను వచ్చి యశోదాదేవి పిలుచు చున్నదని పిలిచితిని. ఇదిగో సత్యాభామ చెలికత్తె.

కృష్ణ. వ.: మహా చాతుర్యం చేసితివోయి.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణుండు చెలికానిఁగూడి సత్యభామ యుండెడి పొదరింటికి వచ్చెడు మార్గం.

దరువు చెలువుండు కృష్ణుఁడు తన చిత్తము కలఁగుచుండగా
అలివేణి సత్యాభామ యలుక దీర్పవచ్చె.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణుండు సత్యభామ యుండెడి పొదరింటికి రాగా సత్యభామ చెలికత్తెవచ్చి పలికెడు మార్గం.

ద్విపద పలికెద [వినుడు] సత్యభామ కృష్ణుండు
జలజాక్షి రుక్మిణి సదనమందుండ
మురిపములను మిఱి ముచ్చటాడంగ
నరయు నెన్నో యుపాయంబులఁ జేసి
తోడ తెచ్చితిని సంతోషంబు మీఱఁ
గూడుము నీవిఁకఁ గూరిమితోను.

సూ. వ.: అవురా, యీ విధంబున సత్యాభామ యుండెడి పొదరింటికి రాఁగాఁ గృష్ణుని నెదుర్కొని సత్యాభామ పలికెడు మార్గం.

దరువు రావయ్య రావయ్యా కృష్ణ!
రతిగూడి యుందాము.

సూ. వ.: అవురా, యీ విధంబున సత్యాభామ వాక్యంబుల విని గృష్ణుండు పలికెడు మార్గం.

దరువు నేడు మిక్కిలి వేడుక లరఁగ
గూడియుందాము కొమ్మరో
జుంటిమోవిని గెంటిసేయు నీవె
జంటగా వాలుగంటిరో. ౧

చిన్ని చన్నులఁ గ్రొన్నెల లుంచెదఁ
జెన్నుగా రావె కన్నెరో
నెమ్మిగాఁ గృష్ణ రమ్మని నన్నుఁ
బిమ్మి కూడవె కొమ్మరో. ౨

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణుండు సత్యభామ యింటికి వచ్చి ముచ్చటలాడుచుండు సమయంబున నావలి కథా సంవిధానం బెవిధాన నంటేను. కృష్ణుండింకను రాకపోయెనని రుక్మిణీదేవి చెలినిజూచి విరహ మభినయించు మార్గం.

దరువు తాళఁజాలనే చెలియారో
యెంతనినేఁ జెల్పుదుఁ జెలియారో
జాళిమీఱనే చెలియారో
మరుఁబారి కోర్వలేనే చెలియారో.
వెన్నెల కాఁకలఁ జెలియారో
విరహముఁ జెందితిఁ జెలియారో
మిన్నగు గాలిచేఁ జెలియారో నే
మిగుల నలసితినె చెలియారో.

సూ. వ: అవురా, యీ విధంబున విరహ మభినయించు రుక్మిణీదేవిని జూచి సఖి పలికెడు మార్గం.

ద్విపద తెలిపెద రుక్మిణీదేవి కృష్ణుండు
పొలుపొంద సచ్చటఁ బోయిన విధము
తెలియుడువని యింటఁ దెలియుచ సీవు
పలికిన హేతువు దయలయ్యె నిపుడు
అల సత్య చెలికత్తె యింబుజోదరునిఁ
పిలుచుక పోయెను బ్రియము రెట్టింప
గట్టిగాఁ జూచితిఁ గమలాయతాక్షి
నెట్టన నామాట నిజముగా నమ్ము.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ జెలికత్తె వాక్యంబులు విని రుక్మిణీదేవి చెలికత్తెను జూచి కోపముచేతఁ బలికెడు మార్గం.

దరువు కల్లరి కృష్ణుండు చెప్పిన కలికి నిజమని యుండి
మొల్లమున వంచన తెలియక మోసపోయితినె
నమ్మరాదె వానిమాట నాతో జాలముచేసి
వాఁడమ్మా! సవతి యింటికిఁ బోయి యుందున్నవాఁడె
కలికి కృష్ణుఁ డిందుండఁగ గర్వమున సత్యభామ
చెలియచేత వానినట్ల పిలువనంపెనె
కాని కాని యిపుడె వాని గర్వమణపక
పూని నెచ్చెలి నాప్రతాప మిపుడె చూడవె.

సూ వ.: అవురా, యివ్విధంబున విరహ మభినయించిన యనంతరంబునఁ గోపంబుచేతఁ దాను నొక్క దిక్కునసుంత సహింపలేక చెలి గూడి శృంగార వనంబునకు వచ్చెడు మార్గం.

దరువు కోపముతో ముద్దుగుమ్మా రుక్మిణి చెలినిఁగూడి
యేపునఁ బొదరింటికిఁ జేరవచ్చెను వింతగా.

సూ.వ.: అవురా, యీ విధంబున రుక్మిణీదేవి చెలికత్తెనుగూడి పొదరింటికి వచ్చియుండు సమయంబునఁ గథానంవిధానంబె విధానసంటేను. కృష్ణుండు సత్యభామను గూడి యీ రుక్మిణి యీ పొదరింట వచ్చియుండుట తెలియక యపుడు కృష్ణుండు సత్యభామనుగూడి చల్లని పొదరింటఁ గ్రీడసేయవచ్చెడు మార్గం.

దరువు సంతోషమునఁ గృష్ణుఁడు సత్యభామనుగూడి
వింతగాఁ బొదరిల్లు చేరవెడలెనిపుడు.

సూ.వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణుండు సత్యభామనుగూడి తానుండు పొదరింటికి వచ్చినదిచూచి కోపమోర్వంజాలక సత్యభామనుజూచి రుక్మిణీదేవి పలికెడు మార్గం.

దరువు చెలువుగా నాయింట నుండెడు చెలువుని
చెలియసంపి పిలిపింపను గారణమేమె కలహకంటకి. ౧

ముచ్చు కాడి యళుకులేక ముద్దుకృష్ణునితోఁగూడ
సిచ్చటకుఁ గ్రీడసేయ నెటుల వచ్చితె.౨

వద్దఁ గృష్ణుఁడున్నఁగాని వంచింపనేసికుఁ దగిన
బుద్ధి చెప్పుదుఁ గొద్దిగబోసినె నిన్ను.

సూ.వ.: అవురా, యిప్విధంబున రుక్మిణీదేవి పలికిన వాక్యంబులు విని సత్యభామ పలికెడు మార్గం.

దరువు పదరిట్లు పలుకకువె ఓభామ
పదరిట్లు పలుకకె పంతము మీఱఁగ
అదరనె నే నీ లొచ్చుట వెగచ్చులాడి. ౧

నాతో నేటివాదె నాథుండొకరి సొమ్ముగాదె
చేతనై లోకువ చేసికోవే పోవే. ౨

ఇంటింటఁ జిందుచుండేమె కృష్ణుండు
కంటగించి నాదు కాంతుఁడె యని నీవు. 3

సూ.వ.: అవురా, యీ విధంబునఁ బలికిన సత్యభామ వాక్యంబులు విని రుక్మిణీదేవి పలికెడు మార్గం.

ద్విపద పలికెద విను సత్యభామ నాయింటఁ
జెలువొంద నున్నట్టి చెలువుని నీవు
పెనగంగ నిటువలెఁ బిలువనంపితివి
మనసీకుఁ దగునట్టి బుద్ధి చెప్పుదునె.

సూ.వ. : అవురా, యీ విధంబునఁ బలికిన రుక్మిణీదేవి వాక్యంబులు విని కోపముచేత సత్యభామ కృష్ణునిఁ జూచి పలికెడు మార్గం.

దరువు

కల్లరికృష్ణ సరిసాటి కాని యీహంత తిట్టగా
చులుకనగాజేసి వినుచుండేది మేర. ౧

కలహకంటకిని నరిగానె హెచ్చుదానఁగానె
చెలువుండు పద్దనున్నాఁడని యోర్చితినే నేను. ౨

ఇచ్చటికిఁ గృష్ణ నన్ను నేలా తెచ్చితివయ్యా యీ
ముచ్చులాఁడి యిందుఁ బొంచియుండఁగా. 3

హెచ్చుకుంద మాటలాడకే ఎవరికిఁ దెలియక విఙని
మచ్చుపల్లి దాఁచుకొన్న మచ్చువేనీవు. ౪

సూ.వ. : అవురా, యీ విధంబునఁ బలికిన రుక్మిణి వాక్యంబులు విని సత్యభామను జూచి కృష్ణుండు పలికెడు మార్గం.

ద్విపద

పలికెద విను సత్యభామ యీరీతి.
గలికి రుక్మిణితోనుఁ గలహింపనేలె
ఏమి నీకది మున్నె యెగ్గొనరించె
వేమారు నీ విట్లు విసనాడ నేలె
జగడంపు మాటలు చాలించుమింక
మునుప యీరకయుండు ముదము మీఱఁగను
అరయంగ నీకది యుక్తికాదటవె
మరియూపలేక యీ మాటలాడకువే.

సూ.వ. : అవురా, యీ విధంబునఁ బలికిన కృష్ణునిఁజూచి సత్యభామ పలికెడు మార్గం.

దరువు

చాలుర యీజాలమింకఁ జాలుర
చాలుర యీజాలమింక చక్కని రుక్మిణుంఙ*
ఇందేలవచ్చి నన్నిట్ల యేచెదవు యీ వగలు. ౧

తొలిఁజేసిన నా పూజఫలము నిట్లనుండఁగ
కలికి కృష్ణుని నిన్నుఁ గారణమేమి జాలము. ౨

మనసైతే కృష్ణ నీ కందు మాటలైతే యిందు
నెనరు తెలిసెనిఁక నిన్ను నేను నమ్మజాల. 3

* రుక్మిణుంఙ = రుక్మిణియుండ

సూ.వ.: అవురా, యీ విధంబున వీడనాడిన సత్యభామనుజూచి కృష్ణుండు పలికెడు మార్గం.

దరువు
ఏలె ముద్దుగుమ్మ ఏలె యో సత్యభామ
ఏలే విడనాడేవదేలె యేలే. ౧

మచ్చకంటిరో నీవు మనసిచ్చి యింతసేపు
ముచ్చటాడినదాన మోడిజేసితివా. ౨

వన్నెమీఱనిపుడు చిన్నికృష్ణ రమ్మని
నన్నుఁగూడినదానవు కన్నులఁజూడవు, కోపమ. 3

సూ.వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణుండు సత్యభామయును నుత్తర ప్రత్యుత్తరంగాఁ బలికెడు మార్గం.

దరువు
చెలువుండ యిట్లేలనీవు పలికితివి రుక్మిణుండంగా
నెలనాఁగ నీవేమనిన నెడఁబాయఁ జాలనెనిన్ను. ౧

తొలుత యింతే మాటలు అలగుణమ్మున్నద నీ కిపుడు
ఎలమియా రుక్మిణికన్న హెచ్చుగాదటవె తనకు. ౨

చెలువుండ నీ వగలెల్ల తెలిసెఁగాదటర
పలుకాకులట్ల నీవేమి బానలిమ్మన్న నిచ్చేనే. 3

సూ.వ.: అవురా, యీ విధంబునఁ దాను వద్దనుండఁగా దన్నుఁ గొంచెము జేసి పలికిన కృష్ణునితో రుక్మిణీదేవి కోపముచేతఁ బలికెడు మార్గం.

దరువు
వద్ద నేనుండఁగానీ వనితను మెచ్చి నీవు
పద్దుచేసి నన్ను కొద్దిసేతురా. ౧

అయా బోలె కాని మాయలు తెలిసెరా
ఇయ్యెడఁ గృష్ణ నిన్నెవరు నమ్ముదుర ఎవరు నమ్ముదుర ౨

అంత మాయజకు లోనైనను ఈ రీతిఁ
జెంతఁజులుకన చేసేవేమిరా. 3

సూ.వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణునితోఁ గోపగించినదై రుక్మిణీదేవి వద్దనుండెడు చెలికత్తెను జూచి యిక్కడ నేల యున్నామని యింటికిఁ బోవుటకు నుద్యుక్తురాలై యుండెడు రుక్మిణిని జూచి కృష్ణుఁడు పలికెడు మార్గం.

దరువు అలుగ కారణమేమే అలుగ కారణమేమే
అలివేణి నీ దానుని అలహంతను నే మెచ్చినది
జాలమని తెలిసి.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణునితోఁ బలుకక యున్నది చూచి కృష్ణుండు మఱియును బలికెడు మార్గం.

దరువు పలుకవదేలె పలుకవె
పలుకవదేలె నేను నీ ప్రాణేశుంత గాదటె
పలుకుచో నోటి ముత్యములు చిందునటవె ౧

చెలియచేత నను నేఁడు పిలువనంపిన దానవు
కలికి నే నిందు వచ్చి పిలిచినను నింతైనా ౨

ఏమంటినే నిన్ను నేమి నేరము చేసితి
రామామణి నన్నిపుడు రమ్మనవేమె దయను. 3

సూ. వ.: అవురా, యీ విధంబున విడువక వెంబడించిన కృష్ణునిఁ జూచి రుక్మిణీదేవి పలికెడు మార్గం.

దరువు ఇక్కడకేల వచ్చేవురా
చక్కని సత్య నీకిపుడు సతమై యుండఁగ నీకు ౧

తప్పున మాటలాడకురా
ముచ్చు వగలు మాని నీ మోహనాంగివద్దకు పోరా ౨

చెలువుఁడ నన్నంటరాకురా
కలహకంఠకైన సత్య అలిగి నిను రావద్దనిని. 3

సూ. వ.: ఆవురా, యీ విధంబున రుక్మిణీ సత్యభామ లిద్దఱున్ను కోపగించి యుండఁగా విరహపరవశుండై కృష్ణుండు విరహ మభినయించెడు మార్గం.

దరువు ఏమని తాళుదు నెవరికిఁ దెలుపుదుఁ
గోమలు లిద్దఱుఁ గోపగించి రిపుడు
కాముని శరముల కాకకుఁ దాళను
రామామణులకతైన రమ్మనవాయెను ౧

తరుణుల కోపము దనపఁ దీర్చెదనని
గరుడుగ నామదఁ గోరిక లూరంగ
వెఱపింపఁ బోయి తా వెఱుచుకొన్నయట్లు
అరుదెంచి వారిచే నగడైతి నిపుడు ౨

చెలువుగ నా కోర్కె చేకూడదాయెను
అలుకైతే తఱుచాయె నతివ లిద్దఱకు
బలుకరు నే నెంత బ్రతిమాలినఁగాని
తెలియక యేవేళ వెలువడి వచ్చితినో. 3

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణుండు విరహ మభినయించినవాఁడై, వీ రిక్కడనుండినచోఁ దనకు లోకువ గారని మఱియొక ప్రదేశంబునకు వచ్చెడు మార్గం.

దరువు మదవతులతోడ మాయదారైన కృష్ణుఁడు
కడల * * * వే మారొక్క పొదరిల్లుఁ జేర.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణుం డెడఁబాసి మఱొక దిక్కునఁ బోయి యుండఁగాఁ జింతనొంది రుక్మిణీదేవి విరహమభినయించు మార్గం.

దరువు మోసపోతిగదవే ఆశించి వచ్చినపుడే
అతనికి లోకువగాక పగలురేయి నాధుఁడు
అలుగవద్దని పలుకుచుండెడు నపుడు ౧

నగధరుని యెంచకనే బిగువుననుండి యిపుడు
భామ యీ వేళను పంచబాణుని బారికింకఁ దాళనే
ఈలాగు వచ్చునేని మున్నింతైనను దెలియక మది ౨

చక్కని గోపాలుని వో చెలియారో
సరస గుణశీలుని మో * * కొనరుచు నేను
మునుపలెఁ గూడకమదిని. 3

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణు నెడఁబాసి సత్యభామ విరహ మభినయించెడు మార్గం.

దరువు నీలవర్ణుని బాయ నిమిష మొక్కేడాయె
నీవేళ మదనుఁడేయ విరహమగ్గలమాయె ౧

చెలువుండు కొనరంగఁ జెలిమిసేయ నైతిఁగా
అలుకతీర్చ నైతిఁగా అయ్యయ్యో పోతిఁగా ౨

గోపాలరాయని గుణము తెలియక మదిని
రాపేల చేసితిని రతిఁ బెనఁగనైతిని. 3

సూ. వ.: అవురా, యీ విధంబున సత్యభామ విరహ మభినయించు సమయంబున రుక్మిణీదేవిని జూచి తొలుతఁ జెలికత్తె పలికెడు మార్గం.

ద్విపద పలికెద విను సత్యభామ లలామ
చెలువుండు నీవద్దఁజేరి కోపంబు
వలదన్న వినకను * * * * చేసితివి
యలిగి కృష్ణుండంత నావలపోయె
కలికి నీ విప్పుడు కన్నీరు నించి
చెలువంబు లేకను జింతనొందెదవు
వలపులచే సాక్షి వానిం దలఁచెదవు
పొలుపొందమున్నె యీ బుద్ధిందుఁబోయె.

సూ. వ.: రావే చెలికత్తె మునుపటి కార్యముం * * తలంచేవు. ఇఁక మీదను గృష్ణునిఁగూడెడి యుపాయము దెలుపవే.

చెలి. వ.: వినవమ్మా! సత్యభామ! నా మాట వినేటట్లయితే చెప్పెదనే.

సత్య. వ.: మహాభాగ్యమాయెను, తెలుపవె.

దరువు సేయవే విభుని డాయవే
కాయజ గురునిఁ జక్కఁగఁ గూడ్తునామాట
కొమ్మరో రుక్మిణిఁ జేరి వేడుకొమ్ము సత్యభామ యీసారి
లెమ్ము తామసమేల నమ్మతిగా నిట్లు. ౧

పట్టపురాణిడిగాద నీకుఁ బలుమారు దానితో వాద
యెట్టిననడి చెప్పినట్లు వినుము నా మాట
చెలియ రుక్మిణితోఁగూడి నీవు కలికి కృష్ణుని జాలవేసి
వలరాజు కేళికావలసినట్లు కూడిట్లు సేయవే. ౨

సత్య. వ.: వినవే చెలియ నీవు చెప్పినది నిజమే సరి. ఎంతైనా నేను జిన్నదానను రుక్మిణీదేవి పెద్దది గనుక నాపెవద్దకుఁబోయి వేడికొనునది న్యాయమే నరి. కాగా రుక్మిణీదేవి వద్దకుఁ బోవాము రావె.

సూ. వ.: అవురా, యీ విధంబున సత్యభామ చెలినిఁగూడి రుక్మిణి వద్దకు వచ్చెడు క్రమం.

దరువు చనవు చెలితో వగమీఱ వచ్చె
సత్యభామ రుక్మిణిఁజేర.

సూ. వ.: అవురా, యీ విధంబున సత్యభామకును రుక్మిణికిని ఉత్తర ప్రత్యుత్తరముగాఁ బలికెడు మార్గం.

దరువు అక్కరో నే నీకు మ్రొక్కెదనె
నే ననిన మాటల నెగ్గు సేయకె
చక్కని చెల్లెల నీ వేమనినఁ గాని
ఎక్కువ తనకిది తక్కువ కాదె. ౧

చిన్నదాన నేమి తెలియనే
నీ చిత్త మెఱిఁగి నడువ నేరనె
ఎన్నరాని నేరము లెన్నిచేసినఁ గాని యది
ఎన్నికగా నెంచ మన్నన సేతునె. ౨

చెలువుండు మనకింత కయ్యముఁజేసి
అలసినందుకు వెరవు తెలుపవె
చెలియరో మన మిద్ద ఱేకమై కృష్ణుని
వెలయవేడి మునువలెఁ గూడి యుందాము. 3

రుక్మి. వ.: ఇద్దఱుం గృష్ణుని యొద్దకుఁ బోయి వేడుకొందాము రావే.

సూ. వ.: అవురా, యీ విధంబున రుక్మిణీ సత్యభామ లిద్దఱుం గృష్ణుని వద్దకు వచ్చెడు మార్గం.

దరువు సరసురాలైన రుక్మిణి సత్యభామయుఁ గూడి
తీరుగఁ గృష్ణుని యలుకఁ దీర్పవచ్చిరి.

సూ. వ.: అవురా, యీ విధంబున రుక్మిణీ సత్యభామలు వచ్చి కృష్ణునిఁ జూచి పలికెడు మార్గం.

దరువు చక్కని శ్రీకృష్ణ యలుకమాను నీకు
మ్రొక్కెదము మ్రొక్కెదమయ్యా
పక్కనుండి మమ్ము పాలించు వాఁడవు
పలుకకున్నావేమయ యీవేళ. ౧

నిన్నింత యెడఁబాసినపుడె మాకొక నిమిషమేడాయెనయ్యా
మా కన్నులాన యిది నిక్కము మామీఁదఁ గరుణ యుంచ
వేమయ్యా ఓసామి. ౨

ఎంత నేరము మేము సేసినంగాని సహించి మన్నించవయ్యా
పంతము చాలించి గోపాలరాయ మమ్ము బాగుగఁ గూడుమయ్యా. 3

సూ. వ.: అవురా. యీ విధంబున రుక్మిణీ సత్యభామల వాక్యంబుల విని కృష్ణుండు పలికెడు మార్గం.

ద్విపద ఎలనాగలార మీ రిద్దఱు మున్ను
చలమునఁ గలహించ చనవింత లేక
తప్పు నాయందుంచి తగవీడనాడి
ఇప్పుడు మీరిద్దఱేకమై మగుడఁ
దిట్టవచ్చితిరేమొ తెలిసె మీ మనసు
వట్టి మాటలు మీ ... ... ... నాపోరె.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గృష్ణుండు పలికిన వాక్యంబులు విని రుక్మిణీ సత్యభామలు పలికెడు మార్గం.

దరువు చెలువుఁడ నీవెంత పలికి ... చేలా
... ... ... ... నీకు శ్రీకృష్ణ
చేతులార నను విడనాడిన వల్లను
చెల్లకదవె నాతోఁ జెలిమిఁక నేలా
నిను నల్లని వాఁడని వీడనాడితి మమ్మా
నీలమేఘం డంటిమి కాని
గొనకొని నల్లని వాఁడని వంచనన్
గొల్లవాఁడని తిట్టలేదటె మీరు
గొల్లవాఁడని నిన్ను వీడనాడితి మా
మా గోపాలుఁ డంటిమిగాని
గొల్లవాఁడనపలనా నన్ను మిక్కిలి
కల్లరీఁడని పల్కలేదటరె మీరు
కల్లరీఁడని మేము పల్కితిమా మేము
కపటనాటక సూత్రుండంటిమి
కల్లరీఁడనవలనా నన్ను గోపాల
కన్యలఁ బట్టిన వాఁడనలేవా
గొల్లభామలఁ బట్టినాఁ డంటిమా నిన్ను
గోపికావల్లభుం డంటిమి
గోపికావల్లభుం డనవలనా చిన్ని
కోమలిని బ్రముచ్చిలిన వాఁడనలేవా
కోమలి బ్రముచ్చిలించిన వాఁడంటి మమ్మా
మమ్మేలు సామంటి మింతెకాని
సామనవలనా మిరిద్దఱుఁ గలహించి
జగడము నావలన వచ్చెనన లేవటె.

సూ. వ.: ఈ విధంబునఁ బలికిన కృష్ణునిఁ జూచి రుక్మిణీ సత్యభామలు పలికెడు మార్గం.

దరువు నేర మెంచెదవేల నెనరుంచు మీవేళ
కూరిమి మీఱఁజాల గోపాల దీనపాల. ౧

ప్రొద్దాయె మాపైనిఁ బొలయలుకలు మాని
బుద్ధి లేకున్నఁగాని దిద్దుకోవలెఁ గాని. ౨

ఆటవారల మింత యగడు కోర్గుమొకింత
మాటాడుము శ్రీమంత మమ్మేలు రూపవంత. 3

సూ. వ.: అవురా, యీ విధంబున రుక్మిణీ సత్యభామల వాక్యంబులు విని కృష్ణుండు పలికెడు మార్గం.

దరువు కొమ్మలార ముద్దుగుమ్మలార పూని మాటాడెదఁగాని
పొందుగ మీమోవి తేనెలిచ్చెదరటవె తీరుగా నీవేళ. ౧

ముద్దుబెట్టెదఁగాని మోహముమీఱఁ జెక్కు
లద్ద మిచ్చెదరటరె పొందికగా నీవేళ.
నిండు క్రొన్నెలలుంచెద నీటుగా మీ చను
కొండ లిచ్చెదరటరె కొనవుచు నీవేళ
నేను దాఁచనిల్లెదను నెఱయ నామేనున మీ
మేనుఁ జేర్చరటరె మిన్నగ నీవేళ
తడయక కోరెద దయచేసి మీ నీవి ముడి
విడచెదరటరె ముచ్చటఁగ నీవేళ.

సూ. వ.: ఈరీతిఁ బలుకఁగా వారు కృష్ణునితోఁ బలికెడు మార్గం.

వృత్త దరువు

చెలువుగ నీపాద సేవసేసెదము నీ
పలుకులు విని మేము పరఁగ నడచెదము
పొలుపొంద నిది నిజము పూవిల్తు పదమాన
హాయింక వెలయంగ మమ్మేలరా, శ్రీకృష్ణ
వేడుక మీఱఁగ రారా.

సంపూర్ణము

# కిరాత విలాసము

రచయిత : శాహాజి

# కిరాత విలాసము

జయ పార్వతీరమణ జయ జానకీరమణ
జయ అంతకదమన జయ మధుసూదన జయ
జయ త్రిపురసంహరణ జయ వేదోద్ధరణ
జయ అఖిలనుతచరణ జయ జనాభరణ. ౧

జయ రవిశశినేత్ర జయ యఖిలనుతిపాత్ర
జయ పావనచరిత్ర జయ జగన్మిత్ర
జయ నందివరవాహ జయ అండజవాహ
జయ నిత్యోత్సాహ జయ శమితవాహ. ౨

మంగళం

మహనీయ త్యాగేశునికి మంగళం
మహనీయ చారిత్రునికి మంగళం
కనకావతంసునికి గమనీయ చరిత్రునికి
మనసిజహరునికి మంగళం. ౧

సోమస్కందమూర్తికి శోభనప్రదునికి
మామీదదయసేయు సామికి మంగళం. ౨

భోసలకుల శాహేంద్ర భానుకులదేవునికి
మాశివత్యాగేశునికి మంగళం. ౩

శ్లో. దోర్భిర్యుక్తా చతుర్భిఃస్ఫటికమణిమయీ మక్షమాలాందధానా
హస్తేనైకేన పద్మంసితమపిచశుకం పుస్తకం చాపరేణ
భాసాకుందేందు శంఖస్ఫటిక మణినిభాభాసమానాసమానా
సామేవాగ్దేవతేయం నివసతువదనే సర్వదాసుప్రసన్నా.

సూ. వ.: ఈవిధంబున శారదా ప్రార్థన చేసినతరువాత విష్ణుప్రార్థన సేయు మార్గం.

శ్లో. కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతం
వటస్యపత్రస్యపుటే శయానం
బాలంముకుందం మనసాస్మరామి.

సూ. వ : ఈవిధంబునఁ బార్వతీ పరమేశ్వర ప్రార్థనసేయు మార్గం.

శ్లో. తారానాయకశేఖరాయ జగదాధారాయ ధారాధర
చ్ఛాయాధారకకంధరాయ గిరిజాసంగైక భృంగారిణే
సద్యశ్శేఖరిణేదృశాతిలకినే నారాయణేనాస్త్రిణే
నాగైఃకంకణినే నగేనగృహిణే నాథాయనిత్యంనతిః.

సూ. వ. : ఈవిధంబున సకలదేవతాప్రార్థనసేసిన యనంతరంబున శ్రీశాహరాజ ప్రణీతంబైన కిరాతవిలాసంబనెడు నాటకంబునందుఁ దొలుతఁ గథాక్రమంబు వినిపించెడు మార్గం.

ద్విపద
శ్రీసదాశివుఁడు రాజితగిరీశుఁడు
భాసిల్లుచున్న యాపార్వతితోడఁ
బన్నిదమొనరించి పగడసాలాడి
విన్నైనచెంచుల వేషంబుపూని
వెడలె; రుద్రాణియావిధము వహించి
పుడమిపైఁజరియించి భూతేశుఁజూడ
నరసంబులను గ్రొత్తసయ్యాటములను
ఇరువురుఁగామించి యేకమౌటయును
ననుకతలంజాల నలరుకిరాత
మనవిలాసము శాహమనుఁడు గావింప
సరసనత్కవివరుల్ సన్నుతిసేయు
ధరణిలో నాచంద్రతారార్కముగను.

సూ. వ. : ఈవిధంబునఁ గథాసంవిధానంబు వినిపించిన యనంతరంబున శ్రీశాహమహారాజ ప్రణీతఁబునందుఁ దొలుత వినాయక ప్రార్థనసేయ విఘ్నేశ్వరుండు వచ్చెడు మార్గం వరాకు.

దరువు
ముదమునఁగుండలముల రుచులమరఁగ
నిదెవెడలెను విఘ్నేశ్వరుఁడిపుడు
కర్ణతాళములు కదలగనల్లన
స్వర్ణనిభుఁడు గణపతితగవచ్చెన్. ౧

మూషికవాహనమున నొప్పుచు శుభ
వేషుఁడువెడలెన్ విఘ్నేశ్వరుఁడు
మనలంబోదరమున ఫణులాడఁగ
మనతను వెడలెను గజముఖుఁడిపుడు. ౨

సూ. వ. : ఈవిధంబున విఘ్నేశ్వరుండు వచ్చి సకల విఘ్నాలు తీర్చిన యా తరువాత కథాసంవిధానం బెలాగుననంటే, తొలుతఁ బార్వతీపరమేశ్వరులు తన

నిత్యకొల్వునకు వచ్చుచున్నారని హెచ్చరించుటకై ప్రమథగణంబులలోని చండ ప్రతాపుండు వచ్చెడు మార్గం పరాకు.

దరువు కటిని వ్యాఘ్రాజినముఁగట్టి కరమునదండముఁబట్టి
జటలురుద్రాక్షలు మెఱయఁ జండ ప్రతాపుండువచ్చె.

సూ. వ. : ఈవిధంబునఁ జండప్రతాపుండువచ్చి సభాసజ్జీకరణ చేసిన యాతదనంతరంబునఁ బార్వతీ పరమేశ్వరులు తమ కొల్వునకు వచ్చెడుమార్గం.

శ్లో. చారుస్మేరాననసరసిజం చంద్రరేఖావతంసం
పుల్లన్మల్లికుసుమకళికా ధామసౌభాగ్యభారం
అంత .. ... ను చలనుశంపూరత్నపీఠేనిషణ్ణం
లోకాతీతం శివపదపదం రూపమప్రాకృతంతే.

దరువు శంకరుండు వెడలె వింతవింతగా
శంకరుండు వెడలె
శంకరుండువెడలె శర్వాణి సహితముగ
బొంకిమీఱంగనాగ కంకణములు మెఱయ
బాలచంద్రచంద్రికలు పాలమునవిలసిల్ల
లాలితరుద్రాక్షసరులు రాజిల్ల నురమున.

సూ. వ. : ఈవిధంబునఁ బార్వతీ పరమేశ్వరులు వచ్చి తమకుఁ బ్రొద్దు పోలేదని తమలోఁ దమరు పలికే మార్గం.

పర. వ. : వినవే పార్వతి మనకుఁ బ్రొద్దుపోలేదె. అవతలి మొన్న న .. ర... .. తిమి, మొన్నఁ జతురంగ మాడినట్లాయెను. నిన్న గెంజపాడి, నేడు పగడసాలాడుదమే.

పార్వ. వ : వినవయ్యా పరమేశ్వర నిన్న మొన్న ఆడినదంతనరి. అట్లాగంటి యాట యాడి ప్రయోజనమేమి ? గెలిచినవారికి సంతోషములేదు. ఓడినవారికి విచారములేదు. ఇట్లు ... ... అది ప్రయోజనంలేదు. పందెంవేసికొని ఆడ వలెను. అపుడు వినోదంగా నుండును.

పర. వ. : వినవే పార్వతి, నీమనస్సునకు నచ్చిన పందెమునుగోరు. ఆ పందెమువేసి యాడుదామే.

పార్వ. వ. : వినవయ్యా పరమేశ్వర ! తానోడితే తనసర్వస్వం దేవరకచ్చు చున్నాను. దేవరవోడితే సర్వస్వమున్ను తనకుఁ గట్టడసేయుమయ్యా.

పర. వ. : మంచిది. అలాగే పందెం నమ్మితి. ఇద్దఱున్ను ఆడుదాము రావే.

సూ. వ. : ఈవిధంబునఁ బార్వతీ పరమేశ్వరులిద్దఱున్ను పగడసాలాడెడు మార్గం.

దరువు పగడసాలాడువారము పందెమునఁ బట్టుపడుచనీవురావె
మగుడియేల పల్కెదవు అటువలెగాని మంచిది యాడుదము
పద్దుగనేడు నేఁబార్వతిగెల్వ ముద్దుగదుగకద్దుగ
ఇత్తిగకనులవేల్పన నెత్తనరియత్తికగరావెబత్తిగ
దప్పికడలగెలుప వారినిగెలుప మెచ్చుగనిదెదప్పిగ
బారవాఁచి పందెమిడినది లోకువైయుండ
చేరరావె యింపారఁగ.

కలగె నతనమయాన గెలిచితిసారి
పులితోలి ... యుంచవయ్యా
పలికేవేమి పందెములేదు నీవడిగినది
ఎలనాగ యిదిగో చేకోవే
ఆడిగినలాగెతీవంచ కంటిగెలిచితే
తడయకరుద్రాక్షలీవయ్యా
చనవునఁ జూపంచగఁ దనను గెలిచితే
పునుక వెనుక మున్ను చూడకేవయ్యా.

ఆపన్నొకటి కలిగె గెలిచితినయ్యా
పోరిడక త్రిశూల మీవయ్యా.

తెమ్మెదిజూదు గెలిచితి
నిమేని సర్వస్వమెల్ల దయసేయవయ్యా.

సూ.వ.: ఈ విధంబునఁ బార్వతీ పరమేశ్వరులు పగడసాలాడెడు సమయంబునఁ బార్వతిచేతఁ బరమేశ్వరుఁడు గెలువలేకపోయి తన సర్వస్వమెల్ల నిచ్చి కొంచెగాఁడై యుండెడు సమయంబున నారదుండు కలహప్రియుండు గాఁబట్టి యిదె తనకు సమయమని పరమేశ్వర పార్వతుల వద్దకు వచ్చు మార్గం.

దరువు కలహమె కళ్యాణమని కౌతుకమునఁ బల్కుచు
వెలపున వీణ వాయించుచు మేలైన నారదుఁడు వచ్చె.
మేనంత విభూతిబూసి మెఱుగు జడలు ముడివేసి
వానవారిని స్మరణచేసి తాండవమాడుచు వెడలెతపసి.

సూ.వ.: ఈ విధంబున నారదుండు వచ్చి పరమేశ్వరునిఁజూచి పలికెడు మార్గం.

దరువు ఎంతకంటి నేఁడు ఎన్నఁడు లేని
ఎంతకంటి నేఁడు ౧

విశ్వేశ! కల్లగాదు నాతోడు పులితోలు, ఎత్తజెనిబాయును
పున్నె యెక్కడ గానను ౨

రుద్రాక్ష మాలికయేది రూఢైన త్రిశూలమేది
నాగభూషణములేవి నాగచర్మాంబరమేది.

విభూతి భరణికానము వృషభ వాహనము కానము.
ఇదియంతా యెవరికి దయచేసి ఈశ! పేరు ప్రకటము చేసేవు.

పర.వ.: వినవోయి నారద! పతి యేమియును విశేషములేదు. నేనున్ను పార్వతియును బందెము వేసి సొగటాలాడఁగాఁ బార్వతి గెలిచెను. కాఁబట్టి యంతయు నిచ్చితిని. అవియంతయు నిక్కడ యుంటే నేమి, అక్కడ యుంటేనేమి. ఇదియొక్క వినోదమోయి.

నార.వ : వినవయ్యా పరమేశ్వర! యిట్టి వినోదమెక్కడను గానము. మీరైతే యిచ్చితిరి. ఆపె యింతైనను భయములేక యేలా చేకొనెను. లోకమందు స్త్రీ పురుష న్యాయమిట్లా కలదా. ఎవరైనను చూచినా వినినా నవ్వుదురు. ఇదియేమి వినవ మయ్యా. తనకైతే సరిపోలేదు. మీరు పెద్దలు. మీకు నెటువలె నడిపోయి యున్నదో తెలియదు.

పర.వ.: వినవోయి నారద!. అయితే యిట్లాయె. ఇఁక మీఁదనేమి సేయ వలెనో చెప్పవోయి.

నార.వ.: వినవయ్యా పరమేశ్వర! మీరు ఆఁటవేళ అంతయు నిచ్చినట్లు చెప్పితిరి. ఆటవేళఁ బందెము చెల్లించితిరి. అది యప్పటికాయెను. ఇప్పుడు మీరు పోయి యడిగిన యెడల నిస్తుంది తీసికొనిరావయ్యా.

సూ.వ.: అవురా, యీ విధంబున నారదుండు చెప్పిన వాక్యంబులు విని పర మేశ్వరుఁడు తనవస్తువులనిమ్మని పార్వతి నడిగెడు మార్గం.

పర.వ.: వినవే పార్వతి! ఆటవేళ పందెము నిమిత్తమై యిచ్చితిని. ఇప్పుడు తన్ను జూచిన వారెల్లరు నవ్వుదురే. తన వస్తువులఁ దయకియ్యవే.

పార్వ.వ.: ఆటలో గెలిచినది యడుగుదురా యెవ్వరైనంగాని.

ప. నీటుగాఁడ నా ప్రాణేశ! నీలలోహిత యిపుడు. ౧

ఈయరాదని గంగ చెప్పెను ఇపుడు నాతో నిందఱు వినఁగ నీమాట.

న్యాయమున మీరు వచ్చి నిష్ఠురముగ నడిగెడిది మేర. ౨

ఇంటి సొమ్మడిగితే యీయవచ్చు
నెనరున మీరు ఏమడిగిన నీయవచ్చు
జతగూడి నాతో నాటలాడి నర్వస్వమును నేసి.

సూ.వ.: ఈ విధంబునఁ బార్వతి వాక్యంబులు విని పరమేశ్వరుఁడు పలి కెడు మార్గం పరాకు.

దరువు ఓహో భళా లెస్సాయెను ఒంటిగా నుండేందుకు
సహాయము గలిగెను అయితే నమ్మరాదు

దరువు స్త్రీల నమ్మరాదె యెంతైన స్త్రీల నమ్మరాదె
స్త్రీల నమ్మరాదే, యనుమాట
నీలవేణిరో నేడు నిజమాయె నీ వలన ౧

మగడు మంచి వస్తువులు మచ్చికనిచ్చినఁ గాని
నగము సేయుదురు మచ్చరముననను ౨

పెనిమిటి యొకయింత పిలిచినపుడె వచ్చి
గరిమను దలకెక్కి గెంతులు వేయవత్తురు ౩

పురుషుండు దయచేతఁ బూజ్యమండలిలో సేయ
పురుషు వంచించి పురుషుఁ బొందెదరు ౪

ఇటువంటి సతిధర్మము ఈ జగమున నుండ
నెచటఁ గానఁతురని మనసు గరగునె యింతైన. ౫

సూ.వ.: ఈ విధంబునఁ బరమేశ్వరుండు కోపముచేతఁ బార్వతితోఁబలికి తిరుగనారదునితోఁ బలికెడు మార్గం.

పర.వ.: వినవోయి నారద! నీవుపోయి యడుగమంటివే, ఆలాగేపోయి యడిగితిని. అది యిచ్చేది లేదనెను. కాఁబట్టి కోపగించి యక్కడికి వచ్చేది లేదని చెప్పి వచ్చితిని కాఁబట్టి వనాంతరమందు పోవలెనే, యిపుడైతే యిట్లా యున్నాము. ఇఁకనే వేషముతోఁ బోదాము చెప్పవోయి.

నార. వ.: వినవయ్యా, పరమేశ్వర! చెప్పేటందుకు వెఱపాచున్నది. వెఱచి చెప్పుదునో వెఱవక చెప్పుదునో.

పర. వ.: వినవోయి నారద! వెఱపేల నీకు మనస్సు వచ్చిన చెప్పుమోయి.

నార. వ.: వినవయ్యా పరమేశ్వర! స్వామి వారు అభయమిచ్చినారు. కాఁబట్టి వెఱవక చెప్పుచున్నాను. ముందటైతే జోగి వేషమై యుంటిరి. అదిపోతే యడవిలోఁ దిరుగునందుకు నాలుగాకులు కట్టుకొని చెంచువేషం వినా మఱయేమి యున్నది. కాఁబట్టి యారీతిగఁ దనకుఁ దోస్తున్నది. తోఁచింది చెప్పితిని. ఇఁకమీఁద స్వామివారి చిత్తము.

పర. వ.: నీవు చెప్పిన విచారమే సరి. అలాగే చెంచువేషము వేసికొని యడవిలో సంచారము చేతామోయి.

సూ. వ.: ఈవిధంబునఁ బరమేశ్వరుండు చెంచువేషంబు ధరియించి పోయిన యీ తదనంతరంబున నారదుండు పార్వతీదేవికి వందనం బాచరించి

పలికెడు మార్గము. వినవమ్మా పార్వతీదేవి నేడు మీ ముఖం చిన్నవోయి యున్నది. ఇందుకుఁ గారణమేమి విస్తారముగాఁ దెలుపుమమ్మా.

పార్వ. వ.: వినవోయి నారద! పరమేశ్వరుండును నేనును బందెము వేసికొని చొక్కటాలాడితిమి. నేను గెలిచితిని పరమేశ్వరుండు సర్వస్వమున్ను తనకు దయచేసెను. అవి తిరుగ నడుగవచ్చెను. ఆట గెలిచింది యీయరాదంటిని. అదే నేరముగా నెంచి కోపగించుకొనిపోయెను. కాఁబట్టి యీరీతిగా నున్నాను.

నార. వ.: ఆటల గెలిచిందంతా మీరును గెలిస్తిరి. వారును దయచేసిరి. అప్పటి వినోద మప్పుడు పోయెను. మరల వారడిగితే యిట్లా నిష్ఠురము చేసేది న్యాయమా. అయితే వినవమ్మా.

దరువు
ఇంత దయవాని మనసు ఏల నొప్పించితివే
ఎంత నిర్దయురాలవే కూడియుంటి వెంతో సంతోషాన
అదియెల్ల నెంచక యింతకుఁ దెచ్చుకొంటివి ఇదియేటి బుద్ధి
జలజాక్షి నీమాటఁ గలలోనైన గాని జవదాటక యుండలేదా
ఇల నేవస్తువైన నీయెదుటఁ బెట్టక యెవరికైన నిచ్చునా
అలప్రాణేశు వితము తెలియలేక నీవు అడరాని మాటలాడి మోసపోయి
చెలువునిపైఁ జాలఁజాడి చెప్పినఁగాని చిత్తమున నెంచండే
వెలఁది నీవు రమ్మంటే యెంత కార్యమైన విడిచి విడిదికి వచ్చునే
ఇరువురి తనువులు భేదములేదని యేకముగాఁ గూర్చునే
సరసశిఖామణైన తరుణేందుశేఖరుని సరసగుణములు
విరసము చేసికొంటివి. ౨

నార. వ.: వినవమ్మా పార్వతీదేవి పరమేశ్వరుఁడైతే కోపగించి పోయినాఁడు. వారికి నింత కోపము తెచ్చేది మీకు ధర్మము కాదు. వారి యనుమతిమీఁద నడచెడిదే సతీపతిన్యాయ మట్లా కాకపోయెనే. అయితే నేమాయె. ఇఁకమీఁదనైనను వారుండే చోటికి మీరుపోయి వారి నడిగికొని యాయన మనస్సు రానడుచుకొను మమ్మా.

పార్వ. వ.: ఈవిధంబున నారదుని వాక్యంబులు విని పార్వతీదేవి విరహ మోర్వంజాలక సఖినిఁ జూచి పలికెడు మార్గము.

దరువు
ఏమంటినే వానికి నేమి చేసితి నేరము
కామహరుఁ డూరకే నామీఁద నలిగెనోయి ౧

పతి తనప్రాణబంధువు పతి తనపాలి దైవము
పతి యీలాగుచేసిన గతి వేరే సతులకేమి. ౨

పార్వ. వ.:

సూ. వ.: పార్వతీదేవి మఱియును విరహ మధికమయించెడు మార్గం.

దరువు ఏలాగు తాళుదునే యేలాగు తాళుదు నెవ్వారి నంపుదు
ఫాలాక్షు నెడఁబాసి భయములే కెట్లుందునమ్మా ౧

ఈ వెన్నెల చిచ్చు బూా మదనాగ్నిని
నేవిధమునఁ జల్లార్తు ఏ మోహ మెట్లా తాళుదునో ౨

ఈ చిలుకలపలుకులు నీ యళిఝంకృతులు
నీ చలువగాలి బాధ యెట్లా యోర్తు నమ్మలారా 3

చెలువుని గుణములు చెలువైన వగలు
తలఁచినపుడే గుండె తల్లడమందెనేయమ్మా. ౪

సూ. వ.: ఈవిధంబునఁ బార్వతీదేవి మఱియును విరహ మభినయించెడు మార్గం.

దరువు నా నేరమే నన్నింతచేసె
నా నేరమే నన్నింతచేసె నాధునిపై దోసములేదు
పూని వాని మనసు విఱిచి పుణ్యమునేఁ గట్టికొంటి
సంతసమున నాతో వాఁడు సరసము లాడుచుండును
వింతసొమ్ము లిచ్చును వింతకోక లిచ్చును
అంతరంగమున నాతో నాదరించి మాటాడును
ఇంత దయవాని మనసు నెఱుఁగక మోసపోతిని ౧

వెలయఁ బాట బాటుదుము విరిసరులు చుట్టుకొందుము.
మెల్లనె యొకరి కొకరు మేన గంధముఁ బూతుము
కిలకిల నవ్వుదుము కనిసి కౌఁగిలింతుము
సలలితసామితో సరసముగా నుండనీయక ౨

చెక్కులు నొక్కును చిలికి ముద్దుఁబెట్టి
చక్కెర మోవినానును సెబాసని మెచ్చును
చొక్కమైన వగలను సుమశరుని కేళిఁగూడును
మక్కువ రాజశేఖరుని మమత పోయి పగదాననైతి. 3

సూ. వ.: ఈవిధంబునఁ బార్వతీదేవి విరహ మభినయించి నారదునిఁ జూచి పలికెడు మార్గము

పార్వ. వ.: వినవోయి నారద! పరమేశ్వరుండు కోపించుకొని పోయినాఁడె. అందుకు నేరీతిఁ బోయి పిలువవలయునో యోచన చెప్పవోయి.

నార. వ.: వినవమ్మా పార్వతీదేవి! పరమేశ్వరుఁడు చెంచు వేషము వేసికొనిపోయి వనాంతరాలయందు సంచారము చేస్తున్నాఁడు. మీరును, అలాగే

చెంచువేషము ధరించి వనాంతరమందు సంచారముచేసి పరమేశ్వరుని వెదకిచూచి యాయన ననువర్తించి యాయన దయ రాఁజేసికో. పిలుచుకొని రావమ్మా.

పార్వ. వ.: మంచిది. అలాగే పిలుచుకొని వచ్చెదను.

సూ. వ.: ఈవిధంబునఁ బార్వతీదేవి విరహంబున కోర్వలేక నారదుని పలుకులు విని చెంచువాఁడై పోయిన పరమేశ్వరుని వెదకు నిమిత్తమై తానును జెంచు వేషముఁ బూని పోయెను. అవతలకథ యేలాగునంటే పరమేశ్వరుఁడు చెంచు వేషము బూని వనాంతరమున వచ్చెడు మార్గం.

దరువు చెంచుఱేఁడు వచ్చెను పచ్చవిల్లు చేతఁబూని వింతగా
పారుటాకులు గతి పల్లవెం(దుకలు మీఱ
శిరంబున మెఱయఁజుట్టి సారె వెన్నెలగాయు తీరైన నుదుటను
ఘోరున జేఁగురు బొట్టుపెట్టి. ౧

సూ. వ.: ఈ విధంబునఁ బరమేశ్వరుఁడు చెంచు వేషముఁ బూని వనాంతరములయందుఁ దిరిగెడు మార్గం.

దరువు అడవి వింతలే వింతలు
పుడమిని లేనివెల్లఁ జొరఁగనుచున్నాను
నానావిధ మృగములు నానావిధ పక్షులు
నానావిధ వృక్షాలు నానావిధ తీఁగెలున్నవి ౧

నానావిధ కొండలు నానావిధ నదీనదములు
నానావిధ దేవస్థలాలు నానావిధ తీర్థాలున్నవి ౨

నానావిధ కందమూలాలు నానావిధ ఫలములు
నానావిధ పుష్పాలు నానావిధ ఔషధాలున్నవి 3

నానావిధ రత్నాలు నానావిధ తేనెలు
నానావిధ పశుజాతులు నానావింతలు గనుచున్నాను. ౪

సూ.వ.: ఈ విధంబునఁ బరమేశ్వరుండు నానావనాదులుం గనుంగొని హిమాచలమునందు రమ్యప్రదేశముం జూచి తపస్సు చేయు సమయమున, నావలి కథా వృత్తాంత మేలాగుననంటే, పార్వతీదేవి చెంచురాలి వేషము వేసికొని పరమేశ్వరుని వెదుక వచ్చెడు మార్గం.

శ్లో. మధ్యే బంధ మయూర పించ నికరాం శ్యామాం ప్రవాళాధరాం
గుంజాహార ధరాం ధనుశ్శరకరాం నీలాంబరా డ ... ...
శృంగీవాదన తత్పరాం సునయనాం మూర్ధాం .... ... ...
బిల్లీ వేషధరాం నమామి శబరీం తామేక వీరాం వరాం.

దరువు భవాని వెడలె భిల్ల వేషమున
గురిగింజదండ లుంగరములు చేతులఁ దనరఁగా
నిడుపైన నెమలి తెక్కలు నడుమున విలసిల్ల
శరచాపశూలములు కరమునఁ బూని వేగ.

సూ. వ.: ఈ విధమునఁ జెంచురాలు వచ్చిన సమయమున వనదేవతను జూచి పలికెడు మార్గం.

దరువు ... .... ...
... ... ...
... ... ...

పున్కకంచమువాఁడె పుత్తడి గట్టు విల్తుఁడె
పనిచెఱుపుల దొరతండ్రె ఓ చిన్నిపడుచ
పాఁప సొమ్ముల వేల్పె ౨

పులితోలు గట్టినవాఁడె బూచుల యేకిమీడె
వలిగట్టు రాయని యల్లుఁడే పడుచా నన్ను వంచించి యిటువచ్చినాఁడె.

సూ. వ.: ఈ విధమునఁ జెంచురాలు వనదేవత నడుగఁగా వనదేవత ప్రత్యుత్తర మీక యుండెఁ గనుక, తానే వనాంతరంబున వెదకెడు మార్గం.

దరువు వనములెల్ల వెదకితి హరునిఁ గాననమ్మా
మన పర్వతాలు వెదకితి హరునిఁ గాననమ్మా ౧

చెట్టుచెట్టుల వెదకితి హరునిఁ గాననమ్మా
మన ... ... ల వెదకితి హరునిఁగాన ౨

పుణ్యస్థలము లెల్లఁ జూచితి హరునిఁగాన
పొదరిండ్లెల్లఁ జూచితి హరునిఁ గాన 3

నదులంత వెదకితి హరునిఁ గాన, నాథునిక
మన గుహలలో వెదకితి నెటుగాననమ్మా. ౪

సూ. వ.: ఈ విధంబునఁ జెంచురాలు వెదకి చెంచువానిఁ గానక యంతటం గలసి మెలసి యుండెడు పక్షిజాతులం జూచి పలికెడు మార్గం.

దరువు కలయ మధుపానము సేసెడు గండుతుమ్మెదలైనఁ గాని
కులకాంతలకుఁ దేనె కొసరి యిచ్చేది చూడు
అటులఁ గాదాయె యయ్యోయెవా తన బ్రదుకు ౧

మటుమాయ హరుఁ డిపుడు మమతదాఁ గెందున్నాఁడో ౨

ఫలభంగములు చేసి చిలుకలైనంగాని
చెలికి ఫలము లిచ్చుచున్నవి 3

కొమ్మల చిగురు నమలెడు కోకిలములైనంగాని
కొమ్మకుఁ జిగురుఁ గొమ్మని యిచ్చుచున్నది. ४

సూ. వ.: ఈ విధంబునఁ జెంచురాలు వెదకుచు హిమాచల ప్రదేశమునకు రాఁగా, ఆమె సౌందర్యాతిశయముఁ గనుంగొని మాయా కిరాతుండు మోహించి చెంచురాలితోఁ బలికెడు మార్గం.

దరువు నీవు యిందేల వచ్చినావు చెంచుపడుచా తెలుపవే ౧

చెంచువాన నేను చెలువైన నా పుట్టింటనున్నాను చెంచురాజా ౨

వెలఁది నీ పేరేమి వేగమె తెలుపవే చెంచుపడుచా 3

అందఱుం బిలతురు, ఆకులు లేమిడని చెంచురాజా ४

మగని పేరేమి మచ్చికఁ దెలుపవే చెంచుపడుచా ౫

ఆదరించి వినుము అతనికిఁ బేరు మొద్దు చెంచురాజా ౬

తనయుని పేరేమి తరుణిరో తెలుపవే చెంచుపడుచా ౭

కొమ్ములేనివాఁ డొకఁడు కొమ్మొకటి గలవాఁడొకఁడు చెంచురాజా. ౮

సూ. వ.: ఈ విధంబునఁ బలుకుచును జరిగెడువంటి చెంచురాలిని జూచి చెంచురాజు పలికెడు మార్గం.

దరువు మించిపోకువే పడుచా మంచితనాన మాటాడు
పొంచియున్నది యీడ పులియొకటి త్రోవలో ౧

వేఁటల చప్పుడు వింట మిట్టిమిట్టి పడుకొంట
గట్టున నున్న సింగము పట్టుకొని ౨

కలికి తాళిపచ్చల కడెముల రవళివింటి
అలిగి మదగజము అడ్డము దూఱఁ బోయిని. 3

సూ. వ.: అవురా, యీ విధంబున నచ్చెంచు రాజు వాక్యంబు విని యా చెంచుది పలికెడు మార్గం.

దరువు రామ నిలువమనేవేరా నిలువఁ బనేమిరా
అళికే దానఁగానురా అందుకెల్లా నేను ౧

పులిఁ జంపిన నా మగఁడు పులితోలు గట్టినాఁడు
పులిభయమును బొందునటరా ౨

సింగము గలదని చెంచ వెఱపించేవు
సింగమెక్కెడు నంగన నేరా 3

మదకరి కలదని బెదరించే వేమిరా
మదకరి వదనుఁడు మహిని నా తనయుఁడు. ४

సూ. వ.: ఈ విధంబునఁ బలికిన చెంచురాలిం జూచి చెంచురాయఁడు మోహించి పలికెడు మార్గం,

దరువు తాళలేనె యింక నేను వాళలేనె నినుఁజూచినపుడె నిలువఁ జాలనె
అనుకూలమై నాతో నాదరించి పలుకవె ౧

చంద్ర కిరణములు తలకు నెక్కెఁ జలువగాలి చిచ్చాయెను
పేంద్రు కొడుకు పగసాధించెను ఉపేక్షించేది న్యాయమా ౨

అళులు ఝుమ్మని మ్రోయ నలచిలుకలు రొదలు సేయఁ
బొలఁతి ప్రొద్దుపోవాయె పొందుకు నింక నీ దయ. 3

సూ. వ.: అవురా, యీ విధంబున నచ్చెంచుల కేని వాక్యంబులు విని చెంచులది పలికెడు మార్గం.

దరువు చాలుఁజాలు వెఱ్ఱి మాట యెవరైనన్ వినఁబోయేరు
పురుషుండు బలుకోపగాఁడు పురముల జయించినాఁడు
కరమున శూలముఁ బూని కాలాకారమువాఁడు ౧

ఉగ్రతనయుఁడు, అఖిలవంద్యుఁడు హరిహరాదులకైన వెఱవఁడు
ఉగ్రశాననుఁ డుగ్రతనయుఁడు నిగ్రహించేని నిన్ను ౨

కొండను గొట్టి పిండిచేసెడువాఁడు కోపమువచ్చిన నూఱకయుండడు
దండకధిపతి చుక్కనామా దైత్యమర్దనుఁడు విన్నావోయి. 3

సూ. వ.: అవురా, యీ విధంబునఁ గపట చెంచురాలు పలికిన వాక్యంబులు విని యా చెంచుల కేఁడు పలికెడు మార్గం.

దరువు వెలఁది పలుకులు రిత్తలై యున్నవి
మెల్లనఁ జూడఁబోఁడే మేటి చేరికై యున్నావు.

ప. పురుషుఁ డంటివి వేశే పురుషుఁ డెవ్వరే నే నున్నాను
వెఱపేల యిటురావె విరిబోఁడిరో
గురుతు చూతముగాని కొంత వింతగా నున్నాము
ఎఱుక గలిగినయట్లు తోచేని ౧

తనయుఁ డంటివి నీవు తరుణిరో యిదియేమి
మనవనివలెనే తెచెనే యిప్పుడు
మనసుకే మనసే సాక్షి మఱుమాట యిఁకనేల
ఎనసి చూడఁగాఁ దనువు లేకముగాదా.

పార్వతి వ.: వినవయ్యా మాటలచేతఁ దెలిసి నీ వెవ్వరు నే నెవ్వరు దగ్గఱఁ జేరి పలుకుచున్నారు. ఈ వివరము తెలుపరయ్యా.

సూ. వ.: అవురా, యీ విధంబునఁ బార్వతి పరమేశ్వరు లన్యోన్యమును బలికెడు మార్గం.

పర. వ : ఇందు సందేహమేల ? నేను బరమేశ్వరుణ్ణి. నీవు పార్వతివి.

పార్వతి వ.: వినవయ్యా పరమేశ్వరా! ఇంతమాత్రం తెలిసికొంటిరా. ఆటల్లో యొకమాట యంటిని. అందుకింత కోపంచేసి యెక్కడకు వస్తిరి. నాటనుంచి యీ వేషమువేసికొని మిమ్ముఁలమ వెదకి ... .. యెఱుఁగుదురు. ఇప్పుడైనా దయ వచ్చింది చాలునయ్యా.

పర. వ.: వినవే పార్వతీ! ... ... ఉన్నదా. అనేక కోపంవేళ యుంటిని. కాఁబట్టి యిందు వస్తిమి. ఆ నం ... ... పోయెను. ఇవుడు సునమయం. ఇపుడు తామసింపక దయసేయవే.

దరువు తామన మిఁక యేల దయసేయవే పార్వతి
కాము బారికిఁదాళ ... య్యావే స్వామి కౌగిలించితి
చక్కని రుద్రాక్ష సరులు శ్రీమించ దేవర చేకొనవయ్యా
॥క్రీడింతము॥ ౧

కలయ నిండువెన్నెలల కాకల కోర్వలేనె
వెలఁది నీ పోకముడి విడువనియ్యవే
వెలయ నా పోఁకముడివిడువ నిచ్చితి నిఁక
పాల యలుకలుమాని పులితోలు కొనవయ్యా ॥క్రీడింతము॥ ౨

వింతగా నిఁక నేను విరహాగ్ని తాళలేనె
ఇంతి మదన సామ్రాజ్య మేలసియవే
అంతరంగము మీఱ అలాగే కూడియుందాము
సంతోషమాయె మీ సర్వస్వము కొనవయ్యా ॥క్రీడింతము॥ 3

సూ. వ.: ఇవ్విధంబునఁ బార్వతీ పరమేశ్వరులు కూడియుండు సమయం బున నారద కిన్నర కింపురుషులు సంతోషంబున మంగళంబులు పాడెదు మార్గం.

## మంగళం

మాయాకిరాతహరునికి మంగళం నిత్యం
మాయాకిరాతదేవికి మంగళం
అమరవందితునికి ... .. మంగళం
మహనీయ రూపునకు మంగళం
మహారాజదేవునికి మంగళం.

## సంపూర్ణం

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్, వాల్తేరు